# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

విచ్చేనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — ఆధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు



# MR




**MR**
బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి - అతి
స్వచ్ఛమైనవి.

## MADHU REFINARY PRIVATE LIMITED
## GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.

Phones : 42729. 42730. 42731. Resi : 42732. Fax : 42730. STD : 08552.

## MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,
Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961


**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)


అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గివదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేమున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకిలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబ సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



**స్థాపితము**

1969



**సంపుటి**

29



**సంచిక**

2



**అక్టోబరు - 1997**



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ : 24911, 25025


సంపాదకీయం

## అప్రస్తుతమైనా అవశ్యము

ఇరవైఎనిమిదిశరత్తులకు పూర్వము - ఒకనాడు, ఒకచల్లని వేళ, నా మస్తిష్కలంలో కదలిన ఒక ఆలోచనకు వాస్తవరూపము ఈ "వైశ్య ప్రబోధిని"

హైద్రాబాద్ ప్రధానకార్యస్థానంగా స్వాతంత్ర్యసమర యోధులు, సంఘోద్ధారకులు శ్రీ కెసి గుప్తగారి సంపాదకత్వమున గుప్త, పశ్చిమగోధావరిజిల్లా పెంట పాడు ముఖ్య కార్యరంగంగా శ్రీ తాడికొండ నరసింహం గుప్త సంపాదకత్వమున వైశ్యమిత్ర - అప్పుడు - అంటే ఆ ఇరవైఎనిమిదిశరత్తులకు పూర్వము వెలువడేవి ఆ రెండింటినీ సాకల్యంగా పరిశీలించిన నాకు రాష్ట్రము లోని అన్నిప్రాంతాల సమగ్రసమాచారముతో మరొక్క పత్రిక ఆవశ్యకమనిపించింది ప్రాంతీయతకు అవ కాశమూ - ప్రధాన్యమూ లేకుండా, మూడు ప్రాంతాలకూ వారధిగా 'ఆర్యజనుల'కు సంబంధించిన విశేషాలూ - వివరాలూ - వార్తలూ - ఇతివృత్తాంతాలూ అందులో ఉండడము * అవసరమన్న భావమూ కలిగింది. ఆ అవసరమే యీ వైశ్య ప్రబోధిని ఆవిర్భావానికి ప్రధాన హేతువు

'వార్తలోన జగము వర్తించు చుండును' - అను వాక్యాన్ని వినని వారరుదు. ఆ వాక్య సారాంశాన్ని గమనించిన వారికి పత్రికయొక్క ప్రయోజనమూ, ప్రాధాన్యతా తెలికపోదు.

౧౯౬౯ఆగస్టునెలలో పరిచయసంచికగా - ప్రప్రథ మంగా వైశ్యప్రబోధిని ప్రజల చేతుల నలంకరించింది. ౧౯౬౯ సెప్టెంబరు నుండీ క్రమపత్రికగా వెలువడుచూ సంఘీయులకు ప్రయోజనకారిగా నిలిచింది ఇరవై ఎనిమిదిసంవత్సరాలు నిరంతరంగా శ్రమించి సంఘీ యులకు అక్షరరూపసేవ లందించి, తన ఉనికిని సార్థకం చేసుకొంది

వైశ్యసంఘచరిత్రలో - పలునామాలతో పలుపత్రికలు ఇంతకు ముందు వెలువడ్డాయి అవి ఏవీకూడా - వాటిలో ఏ ఒక్కటీకూడ - ఇంత దీర్ఘ కాలము - ఇంత సక్రమపద్ధతిలో - ఒక్కనెల కూడ ఆగకుండా వెలువడలేదు ఇదే వైశ్య ప్రబోధిని సంతరించుకొన్న ప్రత్యేకత విశేషము ఆ పత్రికాసంపాదకునిగా ప్రచురణకర్తగా - ఈ విషయాన్ని గర్వంగా చెప్పుకొంటున్నాను

'వట్టిమాటలు చెప్పబోకోయ్, పూని ఏదైనా గట్టిమేల్ తలపెట్టవోయ్' - అన్నాడు గురజాడ ఆ వాక్యాలే వైశ్య ప్రబోధిని అవిర్భావానికీ, ఆ తరువాత వేసిన ముందడుగుకూ స్ఫూర్తి వైశ్య ప్రబోధిని తనకు వైశ్యసమాజం ఇచ్చిన ఇత్సాహానికన్నా, ప్రోత్సాహాని కన్నా వందరెట్లుగా వైశ్య సమాజానికి అక్షరరూపములో సేవలందించింది ఇక ముందూ సేవచేస్తుంది

ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్య మహాసభ ఈనాడు ఇంతఉన్నత స్థితిలో ఉంది అంటే అది వైశ్యప్రబోధిని ఆ సభకు పోసిన ఊపిరే కేవలము పత్రికా ప్రచురణతోనే సరిపెట్టుకోక అదేపనిగా పరిశ్రమించి - శ్రమించి నేను అందించిన వ్యక్తిగత సహకారమే - కృషే వైశ్య మహాసభ పేరాన్ని అలంకరించిన వారందరికీ మొన్నమొన్నటిదాకా వైశ్యప్రబోధిని ప్రముఖ ప్రచార సాదనంగా పనిచేసింది ఇవి వట్టిమాటలు కావు ఋజువులతో కూడినవి అయితే వారు ఈ విషయాన్ని మరచిపోవచ్చు ఈనాడు మహాసభకు వైశ్యప్రబోధిని అవసరం లేకపోవచ్చు ఆ యదార్థాన్ని గుర్తించిన సుమనస్కులు కొందరు (పెద్దవారు కారనుకోండి) బాహాటంగానే అంటున్నారు ఆ సంతృప్తే చాలునాకు

ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యయువజనసంఘములసమాఖ్య, శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్, శ్రీ దోమా వెంకటస్వామిగుప్తసాహిత్యపీఠము మొదలగు సంస్థలు వైశ్య ప్రబోధినికి వైశ్యజాతి సమగ్ర అభివృద్ధి యెడ గల నిరంతర ఆలోచనలకూ నిర్మాణాత్మక భావాలకూ సజీవ సాక్షాలు అట్లే, ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యమహాసభకూడ

ఇంతేకాకుండా, వైశ్య ప్రబోధిని కృషి వలనా, నా పరిశ్రమవలనా రాష్ట్రములో ఎన్నో ఆర్యవైశ్యసంఘాలుఆవిర్భవించాయి వాటిలో కొన్ని చైతన్య పథములో దూసుకుపోతూ ఉన్నాయి ఒక్క ఆర్యవైశ్యసంఘాల ఆవిర్భావమేకాదు పలు ఆర్యవైశ్య వృత్తిఉద్యోగుల సంఘాల (అపోపాలు), ఆర్యవైశ్య యువజన సంఘాల ప్రాదుర్భావానికి కూడ వైశ్య ప్రబోధిని సముచిత కృషి చేసింది అంతటితో ఆగక వాటి పురోగమనానికి అద్భుతచోదకశక్తిగా పనిచేసింది

ఏ లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని పత్రిక ప్రారంభమైందో ఆ లక్ష్యాన్ని అణుమాత్రము కూడా మరువకుండా మూడు ప్రాంతాలకు వారధిగా నిలిచింది మూడుప్రాంతాల

వారినీ ప్రగతిపథంలో నడిపించుటలో సారదిగా పనిచేసింది మూడుప్రాంతాల వారికీ అనూహ్యరీతిలో అద్భుతపరిచయాలను కలిగించింది వారంతా ఆయాకాలాల పరిస్థితిని ఆకళింపజేసుకొనుటలోనూ - స్వసంఘాభివృద్ధిని గురించి ఆలోచించుటలోనూ - అందుకు అనువుగా కార్యక్రమాలను చేపట్టడములోనూ. వైశ్య ప్రబోధిని ప్రముఖపాత్రను పోషించింది వారిలో జాగృతిని కలిగించింది 'నేను ఉన్నాను పద ముందుకు' - అంటూ వెన్నుదట్టి పలికింది

'వాస్తవాన్ని అంగీకరించినా, యదార్థాన్ని ఉచ్చరించినా వైశ్య ప్రబోదినికీ - ఆ పత్రికా సంపాదకులుగా నాకూ ఏదో ఘనత చేకూర్తుంది' - అని భావించే కొందరు నాయకులు ఆత్మను సైతమూ చంపుకొని వ్యవహరించారు - వ్యవహరిస్తున్నారు అయితే వారి ఆ కృతఘ్నతాభావన 'అమ్మ'ను నమ్ముకొని ముందడుగు వేస్తున్న నాకు అవరోదం కాలేదు

కొందరు నాయకుల ఆలోచనా సరళినీ, భావవైఖరినీ బాగా గమనించి - నా ఇరవై ఎనిమిదేండ్ల వైశ్య సంఘసేవతో గడించిన అనుబవముతో బేరీజు వేసుకొని ఆలోచించినపుడు - ఒక ప్రధానవిషయము బోధపడింది 'ఈతడు మంచి కార్యకర్త' - అని ఎవరినీ పరిచయం చేయకూడదు అని - 'కార్యకర్త' అని చెప్పగానే వైశ్యసంఘనాయకుల్లో పలువురికి ఈతడు కార్యకర్త అంటే పనిచేసేందుకే పుట్టాడు అందువల్ల పదవులకూ, గౌరవాలకూ అనర్హుడు అని నిర్ణయించుకొని వ్యవహరించడమే గాక ఆ విధమగు జాగ్రత్తలను తీసుకొంటున్నారు

1979 నుండీ ఈ మధ్యకాలములో "వైశ్య" శబ్దము పూర్వపదముగా గల నామములతోమూడు పత్రికలు ఈ రాష్ట్రములో ప్రారంభమైనాయి వైశ్య ప్రబోదిని తమ చెప్పుచేతల్లో లేదన్న ఆవేశముతో - ఆక్రోశముతో ఇప్పటి ఆర్యవైశ్యమహాసభ నాయకులు కొందరు ఆ పత్రికలకు సంపూర్ణసహాయాన్ని అందించారు స్వంత ముద్రణాయంత్రసౌకర్యాన్ని కలిగించుకొనుటకు సహాయపడ్డారు ఆ పత్రికలు అతి కొద్దికాలములోనే ఆగిపోయాయి. ముద్రణాయంత్రాలను అమ్మి సొమ్ము చేసుకొన్నారు ఆ పత్రికాధిపతులు

వైశ్యసంఘానికి అక్షరరూపములో వైశ్య ప్రబోధిని చేసిన సేవనూ, మహాసభాది పలు రాష్ట్రసంఘాల పురోగమనానికీ, రాష్ట్రంలో పలు విధ వైశ్యసంఘాల ఆవిర్భావానికీ, అనంతర పురోభివృద్ధికీ నేను చేసిన కృషినీ అనేకసార్లు అక్షరరూపములో అభినందించి, ఆనందాన్ని వ్యక్తపరచిన - ఈనాటి వైశ్యమహాసభలో అతిగా 'ఇన్ఫ్లూయెన్సు' గలిగిన కొందరునాయకులు అందుకు విరుద్ధంగా మాట్లాడుచూ, ఆత్మద్రోహము చేసుకొంటూంటే - వారి ఆ స్థితికి చింతించవలసి వస్తూఉంది అప్రస్తుతమైనా, అవశ్యమూ, భావితరాలకు గుర్తుచేయాల్సిన అంశమూ అను భావముతో ఈ విషయాన్ని ఇప్పుడు ఇక్కడ పొందుపరుస్తున్నాను.

# బాపూజీ - ఆయన ఆదర్శాలు

- పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి
(సంపాదకులు)

గాంధీగారి ఆశయం తన మాతృదేశమైన భారతదేశ దాస్యశృంఖలమొక్కటేకాదు. స్వార్థము, ఇతరులను పీడించడమూ మనుషులనుండీ పోవాలి. తన భారత దేశము 'రామరాజ్యము' కావాలి అనీ గాంధీ గారు ఆశించారు. పైవాటిని సాధించేందుకే బాపూజీ తన సర్వస్వాన్నీ ప్రజలకొఱకు త్యాగంచేశారు. అందుకే మనమంతా 'మహాత్ముడు' అని ఆయన్ను గౌరవంగా పిలుస్తున్నాం. తనభారతదేశం మమతలకూ - సమతలకూ సంకేతంగా ఉండాలి. కుల-మతాల ప్రసక్తిలేని సమాజంగా కావాలి అనిబాపూజీ ఆశించారు.

1869వ సంవత్సరం అక్టోబరునెల 2వ తేదీన గాంధీగారు జన్మించారు. గాంధీగారికి తల్లిదండ్రులు పుట్టినప్పుడు పెట్టిన పేరు మోహన్‌దాస్‌కరంచంద్ గాంధీ. గాంధీగారి తండ్రిపేరు కరమ్‌చంద్ గాంధీ. ఈయన్ను కాబాగాంధీ అనికూడ అంటారు. కరంచంద్ గాంధీ గుజరాత్‌లోని రాజ్‌కోట కొలువులో 'దివాను'.

గాంధీగారి వివాహం 1882లో జరిగింది. భార్య కస్తూరిబా అప్పటి ఆయన వయస్సు 13 సంవత్సరాలు. కస్తూరిబా 1869 ఏప్రెల్‌లో జన్మించారు.

కస్తూరిబాతో వివాహం నిశ్చయం కాక ముందు గాంధీగారు రెండుదఫాలు నిశ్చయ తాంబూలా లందుకొన్నారు. పెళ్ళి కూతుల్లు మరణించడం వల్ల రెండు సంబంధాలూ రద్దుఅయ్యాయి.

పాఠకులు అర్థంచేసుకొనే ఉంటారు. గాంధీగారికి జరిగింది బాల్యవివాహమనీ, గాంధీకన్నా కస్తూరిబా దాదాపు నాలుగు మాసాలు వయస్సులో పెద్దదనీ.

"కొత్తబట్టలు, ఊరేగింపులు, బాజాలు తప్ప 'పెండ్లి' అంటే ఏమిటో అర్థంకాలేదు. కొత్తగా ఒక అమ్మాయి నాతో ఆటలు ఆడుకోడానికి వస్తుంది అని అర్థమైంది. ఆరోజుల్లో అప్పట్లో జరిగిన ఒక తంతుగా నాకు ఆనందాన్ని కలిగించింది. బాల్య వివాహాన్ని చేసినందుకు ఆ తరువాత మా తండ్రిని నిందించవలసి వస్తుందని అప్పట్లో నేను అనుకోలేదు" - అని గాంధీగారు తన ఆత్మకథలో వ్రాసుకున్నారు.

ఉద్యోగం లభించుటలో దక్షిణాఫ్రికా వెళ్ళిన గాంధీగారి హృదయాన్ని దక్షిణాఫ్రికా లోని అప్పటి భారతీయులస్థితి ఎంతో కలతపరచింది. వారి పరిస్థితిని మెరుగు పరచేందుకు గాంధీగారు కంకణం కట్టు కున్నారు.

దక్షిణాఫ్రికాలోని డర్బాన్ పట్టణములో గాంధీగారు న్యాయవాదిగా ఉన్నరోజుల్లో - ఆయన కార్యాలయములో గుమస్తాలుగా పలుకులాలవా రుండేవారు. వాళ్ళందరినీ కూడ గాంధీగారు సమానంగాచూచేవారు.

గుమస్తాలంతాకూడ తమస్వంత ఇల్లల్లో ఉన్నట్లుగానే భావించేవారు. అప్పుడు అక్కడ ఆయన ఉన్నఇల్లు పాశ్చాత్య పద్ధతిలో కట్టిన దైనందున మేడమీద మూత్రవిసర్జనకు అవకాశంలేదు. అందు వల్ల గాంధీ, ఆయన గుమస్తాలూ పడుకొనే గదుల్లో మూత్రవిసర్జనకు ఒక పాత్రను ఉంచుకొనేవారు. ఎవరిపాత్రను వారే శుభ్రం చేసుకోవాలి.

గాంధీజీ శాఖాహారి. మాంసాన్ని ముట్టే వారుకారు. దక్షిణాఫ్రికాలో గాంధీజీ ఉన్నపుడు కస్తూరిబాకు ఒకసారి పెద్దగా జబ్బుచేసింది. 'జోహానుబర్గ్' లోని ఆస్ప త్రిలో కస్తూరిబాను చేర్పించారు గాంధీజీ. జబ్బుకారణంగా బలహీనంగా ఉన్న కస్తూ రిబాకు బలంకొఱకు గొడ్డు మాంసంకలిపిన టీ (బీఫ్ టి) ఇవ్వాలని అనుకొన్న డాక్టర్లు డర్బాన్‌లోని గాంధీకి ఈ విషయం చెప్పి అనుమతిని కోరారు. ఆమాటలు వింటూనే గాంధీగారి గొంతు కంపించింది. శాఖాహార ప్రచారం కొఱకు నడుముకట్టి పనిచేస్తున్న ఆయన తన శాఖాహారనియమాన్ని ఎలా అతిక్రమించ గలరు? నేనేమీ చెప్పలేను. కస్తూరిబాను అడిగి ఆమె ఇష్టప్రకారం చేయండి అని గాంధీజీ అతికష్టముతో జవాబిచ్చారు. డాక్టర్లు కస్తూరిబాను అడిగే అవకాశం లేనందున, ఆమెకు తెలియ కుండానే ఆమెకు ఇచ్చే సూపులో బీఫ్‌టీ ఇచ్చారు. జోహానుబర్గు వచ్చిన తర్వాత డాక్టర్లు ఆమాట చెప్పారు. గాంధీజీకి అమితంగా ఆగ్రహం వచ్చింది 'మీరు చేసింది మోసం' - అంటూ ఆ డాక్టర్లపై మండిపడ్డారు. అయితే బీఫ్‌టీ ఇవ్వకుండా మేము చికిత్స చేయలేము అని ఆ డాక్టర్లు ఖరాఖండిగా చెప్పగా - కస్తూరిబాను తీసుకొని గాంధీజ డర్బాన్ వచ్చారు. గాంధీజీ తనకు వచ్చిన హైడ్రోపతివైద్యంతో తన భార్యను కాపాడు కొన్నారు. శాఖాహార విషయములో గాంధీగారికి గల కఠినవైఖరికి ఇంతకన్నా మంచి ఉదాహరణ కావాలా?

ఎప్పుడూ సత్యాన్నే పలుకడం, ఏ పనినీ నీచమైనదిగా భావించకుండా ఉండడం, తనదంటూ ఏ వస్తువునూ దాచుకోకుండా ఉండడం, జిహ్వాచాపల్యాన్ని చంపు కోవడం, అంటరానితనాన్ని పూర్తిగా మరచి పోవడం - మొదలగునవి గాంధీగారు పెట్టుకొన్న నిబంధనలలో ముఖ్యమైనవి. ఈ నియమాల పునాదుల పైన్నే గాంధీజీ సబర్మతీ ఆశ్రమాన్ని నిర్మించారు.

గాంధీగారికి కస్తూరిబా అంటే ఎంతో ఇష్టము. బాపూజీ ఒకసారి సింహళంలో జరిగిన ఒక బహిరంగసభలో పాల్గొనుటకు సింహళం వెళ్ళారు. కస్తూరిబా కూడ గాంధీజీ వెంటవెళ్ళింది. బహిరంగసభలో ఒక పెద్ద మనిషి కస్తూరిబాను గాంధీగారితల్లి అని పరిచయం చేశాడు. "ఈమె నాతల్లికాదు నా సహధర్మచారిణి. తల్లి అని పరిచయం చేసి ఆపెద్దమనిషి ఒక చిన్నతప్పుచేశ్వాడు. ఒకరకంగా చూస్తే ఆపెద్దమనిషి చెప్పింది కూడ కరక్టే. ఎందుకంటే నలభైసంవత్స రాలకు ముందే నాతల్లి స్వర్గస్తురాలైంది. నేను తల్లిలేనివాణ్ణి అయ్యాను. అప్పటి నుండీ కస్తూరిబా నాకు తల్లిఅయింది.

కేవలం తల్లియేకాదు ఈమె నాకు స్నేహితురాలు. వంటమనిషి. సేవకురాలు అన్నీతానే అయింది ప్రజలు చేసే గౌరవాలన్నీ నాకు చాకిరి, శ్రమ ఈమెకు. ఆ విధంగా ఒక ఒప్పందకూడ మాకుంది" అని గాంధీ ఆ సందర్భములో చెప్పారు. గాంధీజీ కస్తూరిబా నిరాడంబరతను మెచ్చుకునేవారు. ఈనాటి స్త్రీలు నగలు ధరించడం మానెయ్యాలి అంటూ 21-7-1921న వెలువడ్డ 'యంగ్ ఇండియా' పత్రికలో సంపాదకీయం వ్రాశారు.

బాపూజీ ఆశయాల్లో నూలువడకడం ఒక ముఖ్యమైన అంశం. రాట్నముతోనే ఆయన భారతదేశానికి స్వాతంత్ర్యం తెచ్చారు. "కదురు, కవ్వమూ తిరిగేచోట కరువే ఉండదు" అని గాంధీజీ అనేకసార్లు అనేవారు.

"చదువు అన్నది కేవలం - పుస్తకంలోని పాఠాలు చదివినంతమాత్రాన్నే రాదు. జీవితాన్ని అర్థం చేసుకోవాలి. నీతినీ, ధర్మాన్నీ వంటపట్టించుకోవాలి. అతడేనిజమైన విద్యావంతుడు" అని గాంధీజీ అభిప్రాయం అందుకే, గాంధీజీ తనపిల్లల్ని పాఠశాలలకు పంపేందుకు పెద్దగా తాపత్రయపడలేదు.

హరిలాల్, మణిలాల్, రామదాస్, దేవదాస్ - అనే నల్గురూ గాంధీకుమారులు. మొదటి ఇర్వురూ కస్తూరిబా దక్షిణాఫ్రికా వెళ్ళకముందు జన్మించగా చివరి ఇద్దరూ దక్షిణాఫ్రికాలో జన్మించారు.

కస్తూరిబాకు చదువురాదు. గాంధీజీ ఆమెకు స్వయంగా చదువునేర్పారు. విద్యాధికురాలుగా చేశారు. గాంధీజీ అడుగు జాడల్లో నడచిన కస్తూరిబా గొప్ప సంస్కారవంతురాలుగా, ఆదర్శగృహిణిగా, పతిసేవా ధురంధరగా తయారైంది.

రామనామస్మరణ బాపూజీకి ప్రాణప్రదము. కస్తూరిబా చివరిఘడియల్లో - అంతవరకూ వాడిన ఆయుర్వేదం మాని ఇంగ్లీషువైద్యం డాక్టర్లు ప్రారంభించారు కనిష్ఠకుమారుడైన దేవదాసు తల్లి వైద్య నిమిత్తం కలకత్తానుంచి, విమానంమీద పెన్సిలిన్ ఇంజక్షన్లు తెప్పించాడు.

"మరణశయ్యమీద ఉన్న కన్నతల్లికి, మూడుగంటల కొకసారి సూదిపోట్లు పొడిపించి, మరింతగా తల్లిని బాధ పెట్తావా? ఆమెకు ఇప్పుడు మందులేమీ పని చెయ్యవు. రామనామ స్మరణమే ఉత్తమ' అనిగాంధీజీ ఆ ప్రయత్నాన్ని విరమింప జేశారు.

గాంధీజీ కోరికమేరకు రామభజన (రామధున్) జరిగింది. 1944వ సంవత్సరం ఫిబ్రవరి 22వ తేదీ - మహాశివరాత్రి పర్వదినమున రాత్రి ఏడు గంటల ముప్పై నిమిషాలకు కస్తూరిబా జీవనజ్యోతి ఆరిపోయింది. కస్తూరిబా మృతదేహాన్ని బాపూజీ వడికిన నూలుతోనేసిన ఖద్దరు చీరతో కప్పారు. కస్తూరిబా మరణం బాపూజీ గుండెల్లో మానని గాయం చేసింది.

భారతదేశంకాక మరేదేశమూ, హిందూ మతంకాక మరేమతమూ గాంధీజీ వంటి మహనీయుణ్ణి ప్రసాదించలేవు' అని 'లండన్ టైమ్స్'ఒకసారి వ్రాసింది.

*(శ్రీమతి. కోడూరి లీలావతీదేవిగారి 'కుంకుమరేఖ' ఆధారంగా)*

వైశ్యప్రబోధిని, అక్టోబరు 1997

# గోప్యంగా అంబటిగంగగోపాల్ రాజీనామా
# ప్లీజ్ ! రప్చర్ చేయవద్దు అంటూన్న వేమయ్య

కడపజిల్లాఆర్యవైశ్యసంఘంఅధ్యక్ష పదవికి శ్రీ అంబటిగంగగోపాల్‌రాజీనామా చేశారు. ఈ వార్తలో ఆశ్చర్యం ఏమీలేదు. ఉన్న అబ్బురమంతా గోపాల్ తన రాజీనామాను శ్రీ జయంసుబ్రమణ్యం గారికి ఇచ్చి - ఆ విషయాన్ని పైకి పొక్కకుండా ఉంచడములోనే.

నిజం నిప్పులాంటిది. ఎలాగైతేనేం. ఆ వార్త బయటికి పొక్కింది. ఆ విషయం తెలిసిన ప్రొద్దుటూరులోని కొందరు అడిగితే "మహాసభవారు నన్ను ఆపద్ధర్మ అధ్యక్షులుగా ఉండమన్నా"రని చెప్పుకొంటున్నారు గోపాల్‌గారు.

గోపాల్‌గారు తనరాజీనామాను మహాసభకు పంపడమే పెద్ద 'ఫాల్స్'. కడపజిల్లా ఆర్యవైశ్యసంఘాధ్యక్షులుగాకొండాపురంలో జరిగిన సమావేశములో గోపాల్ ఎన్నిక కావడమే ఆంధ్రప్రదేశ్‌ఆర్యవైశ్య మహాసభ నియమనిబంధనలకు పూర్తి వ్యతిరేకము. తన నియమావళికి పూర్తి విరుద్ధంగా జరిగిన అధ్యక్షుని ఎన్నికను అంగీకరించి మహాసభ తనకుగల అధికారాన్ని ఆనాడే పోగొట్టుకొంది. అందువల్ల గంగగోపాల్ గారు తన రాజీనామా విషయాన్ని రాజకీయం చేస్తే, తాను స్వయంగా పోగొట్టుకొన్న అధికారాన్ని తిరిగి పొందేందుకు - గోపాల్‌గారి రాజకీయాన్ని సాధనంగా చేసుకోవాలను కుంటూంది మహాసభ.

మహాసభనియమావళి ప్రకారము జిల్లా సంఘాలఅధ్యక్షులకాలపరిమితి రెండు సంవత్సరాలు. గంగగోపాల్‌గారి ఎన్నికకు తీవ్రపోటీ ఎదురైంది. పెద్ద మనుష్యులు పరిష్కారమార్గంగా గంగ గోపాల్‌గారిని ఒకసంవత్సరమూ- ఆయనతో చివరివరకూ గట్టిపోటీగా నిలిచిన శ్రీ మాకం నాగ రాజుగారిని ఒక సంవత్సరమూ జిల్లా సంఘానికి అధ్యక్షులుగా ఉండునట్లు ఒక రాజీసూత్రాన్ని ప్రతిపాదించి - 1997వ సంవత్సరము మాత్రమే శ్రీ గంగగోపాల్‌గారు అధ్యక్షులుగా ఉండునట్లు. 1998కి ఆ పదవిని గంగగోపాల్‌గారు మాకంనాగరాజ గారికి అప్పజెప్పునట్లుగా పెద్దమనుష్యులు ఇర్వురినీ ఒప్పించగా - శ్రీ నాగరాజుగారు గొప్ప మనస్సుతో అంగీకరించిన ఫలితంగా శ్రీ గంగగోపాల్‌కు ఈ అధ్యక్ష పదవి ఆనాడు లభించింది. శ్రీ గంగగోపాల్ గారితో ఆనాడే పెద్దమనుష్యులు రాజీనామాలేఖను తీసుకున్నట్లుగా కూడా తెలుస్తూంది. అందువల్ల శ్రీ గంగగోపాల్ గారు తనపదవిని స్వచ్ఛందంగా నాగరాజ గారికి అప్పజెప్పాలేకానీ తన పదవికి సంబంధించిన రాజీనామాపత్రాన్ని మహాసభకు అప్పజెప్పడం కేవల రాజకీయము - ఎత్తుగడ కాక- మరేమౌతుందీ?

ఇంత తిరగడ శ్రీగంగపోపాల్‌గారికి తెలియదనీ - ఇప్పటి ఆయన గురువు, ఎత్తులువేయడములోదిట్ట అనిపించుకొన్న శ్రీ జూటూరు వేమయ్యగారి 'ఎత్తు' అనీ ప్రొద్దుటూరులో కొందరు అనుకుంటూంటే, మరికొందరు, ఎంతోకీర్తినీ, ప్రతిష్ఠనూ

సంపాదించుకొన్న స్వర్గీయఅంబటి గంగయ్యగారికుమారుడుగా శ్రీ గంగ గోపాల్‌కు ఈ పదవి చాలాచిన్నదనీ - ఈ పదవికొఱకు ఇన్ని తంటాలు పడడము గంగగోపాల్ గారికి సమంజసం కాదనీ ప్రొద్దుటూరులో అనుకుంటున్నారు

స్వర్గీయ అంబటిగంగయ్యగారికీ శ్రీ జూటూరు వేమయ్యగారికీ ఎప్పుడూ పడేదికాదు గంగయ్యగారి మనస్సును అనేకసార్లుగా శ్రీ వేమయ్యగారి వైఖరి గాయపరచింది గంగయ్యగారు ఆ విషయము స్వయంగా చెప్పి బాధపడిన సందర్భాలుకూడ ఉన్నాయి శ్రీ వేమయ్య గారు ప్రొద్దుటూరుఆర్యవైశ్యసభకు అధ్యక్షులుగా ఉన్నపుడు ప్రొద్దు టూరులో ఆర్యవైశ్యసభ యాజమాన్యాన ఒక ఇంజనీరింగ్ లేక పాలిటెక్నిక్ కళాశాలలో స్థాపించుటకు శ్రీ గంగయ్య గారి తీవ్రప్రయత్నమువల్ల తీర్మాణమైంది స్వర్గీయ గంగయ్యగారికే ఆ బాధ్యతను సభ అప్పజెప్పింది కానీ సభాధ్యక్షులుగా శ్రీ వేమయ్యగారు తగిన సహకారాన్ని ఇవ్వనందున గంగయ్యగారు తన ప్రయత్నాన్ని సాగించలేక విఫలులయ్యారు ఈ విషయములో శ్రీ వేమయ్యగారు నిర్వ హించిన పాత్రను గురించి - స్వర్గీయ గంగయ్యగారు, మిత్రులతో చెప్పి ఆవేదనపడేవారు ఆర్యవైశ్యమహాసభలో తానేదో ఉన్నత పదవిని సంపాదించాలి అనీ - అందుకు శ్రీ వేమయ్యగారు సహాయపడతారనీ ఆశించిన శ్రీ గోపాల్ గారు తాను జిల్లా సంఘానికి నామమాత్రపు అధ్యక్షులుగా ఉంటూ సర్వాధికారాలూ శ్రీ వేమయ్య గారికే అప్పగించారు అయినా, శ్రీ వేమయ్య రాయలసీమ ఉపాధ్యక్షపదవిని శ్రీ తల్లంసూరమ్మగారికి ఇవ్వమని చెప్పారేకానీ తనపేరు చెప్పలేదని గోపాల్‌గారు బాధపడ్డారని కొందరంటారు

మహాసభ కార్యాలయము నుండీ గంగ గోపాల్‌గారి రాజీనామా విషయాన్ని తెలుసు కొన్న ప్రొద్దుటూరుపట్టణప్రముఖులూ ఆనాటి అధ్యక్షపదవీ నిర్ణయములో ప్రముఖ పాత్రనిర్వహించిన వ్యక్తినీఫోనులో శ్రీ వేమయ్యగారిని ఈ రాజీనామా విషయము అడుగగా - ప్లీజ్ 'రప్‌చర్' చేయవద్దు గోపాల్‌గారు ఏదో సాధించా లనుకుంటున్నారు అన్నారని తెలుస్తూంది ఈ విషయము ఆనోటా, ఈనోటా పడి తమకు చేరిన కొందరు 'ఆధ్యాత్మికవాదిని' అని చెప్పుకొంటూన్న శ్రీ వేమయ్య గారికి ఇది తగదనీ - అందుకే కొందరు ఆయన్ను అనుష్ఠానవేదాంతికాదని అంటారు అనీ అనుకుంటూ సరిపుచ్చుకొంటూ ఉంటే- మరికొంత ముందుకు వెళ్ళిన కొందరు ఈ విషయమై ఒక సమావేశాన్ని ఏర్పాటుచేసి, శ్రీ వేమయ్యగారిని పిలిచి ఇది తగదని గట్టిగాచెప్పాలని ఆలోచిస్తున్నారనీ తెలుస్తూ ఉంది వారు సభ్యత్వము కట్టలేదు - వీరికి అరుసంవత్సరాల సీనియారిటీ లేదు అంటూ ఇలా ఎన్నోరకాల అనర్హతలను అదేపనిగా ఏకరువు పెట్టుతాన్న శ్రీ వేమయ్యగారు ఈ విషయాన్ని దాచి ఉంచడము ఆయనకు తగదనీ అను కొంటూన్నారు - మరికొందరు ప్రొద్దు టూరులో. వైశ్య సంఘాలు సేవాసంస్థలు. వాటిలో రాజకీయాలఊసేకాదు. వాసన కూడ ఉండరాదు. అటువంటి సంఘాల్లో రాజకీయాల జోక్యం దినదినాభి వృద్ధి చెందు చున్నదనేందుకు ఇది ఒక ఉదాహరణ.

అందులో 'నేను లేకుంటే మహాసభ లేదు' - అని అంటూ మహాసభమీద పెత్తనం సాగిస్తున్న శ్రీవేమయ్యగారు ఈ రాజ కీయాలకు అవకాశం ఇవ్వడము గమ నించదగినది.

# మహాసంస్కర్త, మాననీయ సోమయాజి

'త్రైవర్ణికులే వేదము చదువాలి ఇతరులు చదువరాదు' - అనేది ఒక బలమైన వాదన - ఈ వాదన ఈ దేశములో చాలాకాలం చలామణీ అయింది ఈ వాదన తప్పు సర్వులూ వేదాన్ని చదువ వచ్చు అంటూ అనర్గళమైన తన వాగ్ధాటితో తగువైన ఆధారాలతో నిశితంగా ఖండించి సర్వ వర్ణాల వారికీ వేదమును చదువుటకు అర్హతా, హక్కూ ఉంది అంటూ నిరూపించారు శ్రీ ఆత్మూరిలక్ష్మీనృసింహ సోమయాజి. త్రైవర్ణికులు అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు.

పై విధంగా చెప్పుట ద్వారా సోమయాజి అనాదిగా హైందవ సమాజములో కులాల పేరుతో వస్తున్న హెచ్చుతగ్గులను నిరసించారు.

భూమి తిరుగుచున్నది - అని - ఆంగ్లేయులకంటే నాలుగు వేల సంవత్సరాలకు పూర్వమే వేదములు చెప్పాయి. అని చెప్పి సోమయాజి 'గౌః గమనశీల' అను వేదములోని పదాలకు విద్యారణ్యులవారు చెప్పిన భాష్యాన్ని తన ఆ మాటలకు ఆధారంగా పేర్కొన్నారు.

సోమయాజి 1878లో ప్రయాగలో జరిగిన 'మద్యపాన నిరసన సభ' (గుడ్ టెంపుల్ కాన్ఫరెన్సు)కు అగ్రాసనాధిపత్యం వహించారు.

స్త్రీ పునర్వివాహ ఉద్యమానికి - సోమలవారు ఊపిరి. మహాపండితులు. గొప్ప సంస్కర్త. గొప్ప వక్త. ఆదర్శ న్యాయాధీశులు. నాలుగు వేదాలన్నూ కాలనూ, సంహితలనూ చక్కగా చదివారు వాటి సారాంశాన్ని బహుచక్కగా జీర్ణించుకున్న గొప్ప విజ్ఞాని జాతరలూ, సిండ్లు మొదలగు వాటిలో జరుగు జీవహింసను ప్రభుత్వముచే ఆపుచేయించుటకు రాజారామ్ మోహన్‌రాయి కన్నా ఎంతో ముందుగా ప్రయత్నించారు తన ఈ లక్ష్య సాధనకు వీలుగా 'పశువధాఖండనము' అను గ్రంధాన్ని వ్రాసి ఆంగ్లములో ప్రచురించారు ఆయన లక్ష్యము అప్పట్లో నెరవేరక పోయినా, తరువాత రాజారామ్ మోహన్‌రాయి వల్ల నెరవేరింది.

"కృషి ఉంటే మనిషి ఋషి అవుతాడు. మహాపురుషుడు ఔతాడు" - అను వాక్యాలకు పొంకమైన ఉదాహరణ సోమయాజి గారు

"అర్థజ్ఞానం లేకుండా వేదాలను నేర్పించడము తగదు అర్థజ్ఞానముతో కూడ వేదాలను నేర్పించాలి"- అని సోమయాజులవారు వంద సంవత్సరాలకు ముందే వేద పండితులను హెచ్చరించారు ఆ హెచ్చరిక అప్పటి వేదపండితులను ఆలోచనాపరులను చేసింది. వేదములు అపౌరుషేయములు. అంటే అవి పరమేశ్వరుని వాక్కులనుండి పుట్టినవి అందువలన వేద మంత్రాలకు అర్థము, వివరము మొదలగునవి అడుగకూడదు అనునది ఒక నియమము. ఈ నియమాన్ని దృష్టిలో పెట్టుకొని సోమయాజులవారు పై విధంగా హెచ్చరించారు ఈయనలోని

వేద విజ్ఞానసంపదను గమనించిన ఆంగ్ల పండితులు మాక్సుముల్లరు' 'సోమయాజుల వారితో వేదములకు అర్థములను వ్రాయించండి' - అని అప్పటి కళింగ దేశాధిపతి శ్రీ ఆనంద గజపతులకు సలహా ఇచ్చారు.

అంతవరకూ అర్థము తెలియని వేద మందలి అనేకశబ్దాలకు సోమయాజుల వారు అర్థము చెప్పారు. బైబిలులోనూ, ఖురానులోనూ ఉన్న శబ్దాలకూ, వేద మందలి శబ్దాలకూ గల సమన్వయాన్ని వివరించారు. 'వేదము అను పదమునకు మహర్షులు ఉపదేశించిన మంత్రము' అని వీరు అర్థము చెప్పారు. 'బ్రాహ్మణము' వేదముకాదు - బ్రాహ్మణమును వేదములో చేర్చడం తప్పు' అని వీరి అభిప్రాయము. నైఘంటికులు అంటే నిఘంటువులు వ్రాసినవారు 'బ్రాహ్మణము'అను పదానికి "మంత్రేతరమైన వేద విభాగము" అని అర్థమును నుడివారు. వేదములవలెనే బ్రాహ్మణములునూ, ఇతరేయము, శత పథము, సామము, గోపథము అని నాలుగే. మంత్రేతరము అంటే మంత్రము కాని ఇతరము. మహర్షులు ఏమి చెప్పారో దానిని తెలుసుకోవాలంటే మంత్రమును మాత్రమే ఆధారంగా తీసుకోవాలి. బ్రాహ్మణము మంత్రానికి భాష్యమే కానీ వేరు కాదు. భాష్యము అనగా సూత్ర వ్యాఖ్యాన గ్రంథ విశేషము. మూలాన్నీ, భాష్యాన్నీ కలిపి రెండూ సమానములే అనునది కుతర్కము. ఈ రెండింటినీ కలుపుటవల్ల, మహర్షుల ఉపదేశాలకు అపార్థమును కలుగును అని వీరు తమ ఉపన్యాసాలలో ఎంగడించారు. రెండువేల సంవత్సరాలకు పూర్వము ఏసుక్రీస్తు ఉపదేశించిన విషయాలు నాలుగువేల సంవత్సరాలకు పూర్వమే మన మహర్షులు చెప్పారన్నారు. 'ద్యౌపితా' అంటే స్వర్గము మన తండ్రి అనికాదు. ఏసుక్రీస్తు చెప్పినట్లు 'స్వర్గమందున్న తండ్రి' అని వీరు సమన్వయించారు.

'అల్లా' అనగా 'తల్లి' అని అర్థము. "అవ్యేతి ఇత్యత్క్విప్ అవే భూషాయై గృహ్ణాతిలా" అని పదానికి వ్యుత్పత్త్యర్థమును కూడ చెప్పి ఖురానులోని పదాలను, వేదమందలి పదాలతో సమన్వయించి విశదీకరించారు. వేదములను నిగూఢముగా ఉంచకూడదు. ఇహ, పర సౌఖ్యాల కొఱకు ప్రతివారూ వేదాలను పఠించాలి అని అనేకసార్లు నుడివి 'వేదములు అందరి సొత్తు' అని గట్టిగా, చర్విత - చర్వణంగా చెప్పారు.

1887వ సంవత్సరములోనూ 1889వ సంవత్సరము మార్చినెల 9వ తేదీనా వీరు ఇప్పటి అనంతపురం జిల్లా గుత్తి పట్టణములో వేదాలపై ఉపన్యాసాలిచ్చారు. అప్పుడు గుత్తి పట్టణాన్ని 'గౌతమాశ్రమం' అనేవారు. వీరి మొదటి వేదోపన్యాసాల సభకు నికాల్సన్‌దొరగారు ఆధ్యక్షత వహించారు. నికాల్సన్ దొర అప్పుడు అనంతపురం జిల్లాకు కలెక్టరు. ప్రముఖ ఆంగ్లపండితులు 'మాక్సుముల్లర్' గారి సహపాఠి. 1889వ సంవత్సరము మార్చినెల 9వ తేదీన గుత్తి పట్టణములో జరిగిన వీరి వేదోపన్యాస సభలకు అమెరికా సంయుక్త రాష్ట్రాలనుండీ వచ్చిన 'చార్లెస్ పావిలో'

ఆధ్యక్షత వహించారు. సోమయాజుల వారప్పుడు గుత్తి పట్టణములో 'డిస్ట్రిక్టు మునసబు'గా పనిచేస్తూండేవారు. వీరి ఈ రెండూ ఉపన్యాసాలకూ ఇంగ్లీషు వారు కూడ ఎక్కువ సంఖ్యలో పాల్గొని శ్రద్ధతో ఆలకించారు.

'కర్మ'' యొక్క అంతరార్థాన్ని గ్రహించ కుండా, దాన్ని ఆచరించడము వలన సత్యమును ఎన్నటికీ గ్రహింపజాలరు' అని ఆయన తన ఉపన్యాసాలలో గట్టిగా హెచ్చరించారు. ప్రమాణాన్ని చూపకుండా సోమయాజుల వారు ఏ విషయాన్నీ చెప్పేవారు కారు. ప్రమాణము లేకుండా అర్థాన్ని నిర్ణయించేవారుకారు. "వేదము బహుదేవతారాధనను బోధించుచున్నది'' - అనే ఆక్షేపణ ఆరోజుల్లో బలంగా ఉండేది. ఆ ఆక్షేపణను శక్తిమంతంగా ఎదుర్కొని 'వేదము ఏకేశ్వరారాధనను' చెప్పుచున్నది అని చెప్పడమేకాక తనకుగల అపారమైన విజ్ఞానంతో, సవాలు చేశారు. హిరణ్య సూక్తము చాలా ప్రసిద్ధిగలది. ఈ సూక్తము ఋగ్వేదములోనిది. ఈ సూక్తము పది ఋక్కులు గలది. పదియవ ఋక్కు పిమ్మట చేర్చబడినది అనీ, ఆదిలో తొమ్మిది ఋక్కులకే ఈ సూక్తము పరిమితమై ఉండేదనీ వీరు తన ఉపన్యాసాలలో వివరించారు. 'వేదము భారతీయులకు పెద్ద నిధి. తర్క సహాయముతో చదివిన వారికి ఆ నిధి తప్పక లభిస్తుంది. అని దృష్టాంతాలతో ఆయన నుడివారు.

సోమయాజులవారు కృష్ణయజుర్వేదానికి జ్ఞానపరంగానూ, కర్మపరంగానూ కూడ అర్థాన్ని వ్రాశారు. సూక్తార్థప్రకాశికకూ, భగవద్గీతకూ కూడ గూఢార్థాన్ని వ్రాశారు అప్పటి శృంగేరీపీఠాధిపతులు శంకరాచార్యులవారూ, శివగంగ శంకరాచార్యుల వారూ సోమయాజుల వారు భగవద్గీతకు వ్రాసిన గూఢార్థాన్ని విని, వీరి అమృత తుల్యమైన వాగ్వైఖరికీ, వేదములపై గల పట్టుకూ ఆశ్చర్యపడి, 'సద్భావుడు', 'బ్రాహ్మ ణ్యుడు', వేదోక్త స్థాపనాకుశలుడు', అను బిరుదులను ఇచ్చి అతి గొప్పగా సన్మానించారు. వేదములపై తాను చేసిన విశేష పరిశీలన ఆధారముతో వేదవృక్షాన్ని మచిలీపట్నములో స్థాపించారు. ఈ వేదవృక్షాన్ని వీరు అనుదినమూ ధూప, దీప, నైవేద్యాలతో అర్చిస్తూండేవారు మచిలీపట్నములో ఈ మహనీయునిపేర 'ఆత్మూరిలక్ష్మీ నరసింహసోమయాజివైశ్య సమాజ భవనము' అను భవనమును అచ్చట వైశ్యులు చాలా కాలం క్రిందట నిర్మించారు. 1988వ సంవత్సరము డిసెంబరు వరకూ ఈ వేదవృక్షము ఈ భవనములో ఉండేది. 1988వ సంవత్సరము డిసెంబరులో వంగవీటిమోహనరంగారావుగారి హత్యా సందర్భంగా జరిగిన దహనకాండలో ఆ భవనము కాలిపోగా అందలి వేదవృక్షము కూడ భస్మమైంది. విజయవాడలోని శ్రీ భ్రమరాంబామల్లేశ్వర ఆంధ్ర గ్రంథాలయములో ఈ వేదవృక్షము యొక్క ఛాయా చిత్రం ఉంది. స్వర్గీయ గ్రంథివెంకట సుబ్బరాయశర్మగారు రచించిన వీరి జీవిత చరిత్రలో ఆ వేదవృక్షము యొక్క రూపము ఉంది. 'పాణ్యం లక్ష్మీనరసింహము' అను ఒకకవి వీరి చరిత్రను పద్యకావ్యంగా వ్రాశారు. వారు యీ క్రింది విధంగా వేద వృక్షాన్ని అభివర్ణించారు.

సీ॥ ప్రాగ్దిశ రక్తవర్ణముగల్గు నొకకొమ్ము
ఋగ్వేద సంస్థితి నెరుక పరుప
దక్షిణమ్మున హరిద్రపువన్నె నొకకొమ్ము
యయ్యజు శ్రుతి తెలియంగ జేయ
పశ్చిమదిశ నాకుపచ్చ వర్ణపు కొమ్ము
సామవేద స్థితి జ్ఞప్తిదేగ
నుత్తరంబున ధూమ్రయుక్తమౌ నొక కొమ్ము
యల యధర్వమునున్కి దెలుపు చుండ
మీద 'నో'మను వర్ణమ్ము మిగుల నదియు
ప్రణవవర్ణంబు మూలంపుక్రమము దెలుప
వెలయు ప్రణవానుగత వేదముల సమిష్టి
వృక్షరూపంబుచే జూడ విదిత మగును

మానవుడు విధిగా తీర్చుకోవల సినఋణములు నాలుగు. అవి దేవ ఋణము, ఋషిఋణము. పితృ ఋణము, మానవ ఋణము. దేవర్షి పితృ ఋణములు అని ఋణములు మూడే ననడం సర్వసాధారణము. యజ్ఞమును చేయుటవల్ల దేవఋణాన్నీ, తపస్సు చేయుటవల్ల ఋషిఋణాన్నీ, శ్రాద్ధ కర్మలు చేయుట ద్వారా పితృఋణాన్నీ, ధనాన్ని సంపాదించుట ద్వారా మానవ ఋణాన్నీ మానవులు తీర్చుకొంటారు. ఈ నాలుగు ఋణాలలో మొదటిదైన దేవఋణాన్ని తీర్చుకొనుటకు సోమయాజులవారు 1897వ సంవత్సరములో అగ్నిష్టోమాన్ని చేశారు. యజ్ఞము ఈశ్వరునికి ప్రీతికర మైనదని తెలిపినవారు కదా? యాజుల వారు. యజ్ఞాంతమున పశువధ ఉంటుంది. మూర్తీభవించిన అహింసా మూర్తి సోమయాజి. పశువధకు అంగీక రిస్తారా? పిష్టపశువు అనగా పిండితో చేసిన పశువుతో యజ్ఞాన్ని చేశారు. హేవ ళంబినామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి నుండీ, ఏకాదశీ వరకూ - ఆరు రోజుల దీక్షతో సోమయాజుల వారు అగ్నిష్టోమాన్ని చేశారు. 36మంది ఋత్విక్కులు ఈ యజ్ఞ కార్యక్రమములోపాల్గొన్నారు. పిష్ట పశువుతో యజ్ఞము చేయకూడదని పలువురు పండితులు సోమయాజులను అధిక్షేపించారు అధిక్షేపించడమే కాక యజ్ఞాన్ని భగ్నం చేయాలని వారు వరుణ సూక్తాన్ని జపించి వర్షము కురిపించారు. సోమయాజులవారు అష్టదిగ్బంధనము చేశారు. వర్షము యజ్ఞవాటిక మీద తప్ప చుట్టూ పడింది. అహింసా పరమోధర్మః అను వేదము హింసను ప్రోత్సహించదు. యజ్ఞ కార్యక్రమములో ఉచ్ఛరించబడు "ఆలభతీ", సంజ్ఞపనం" అను రెండు వాక్కులను అపార్థము చేసుకొనుటవల్ల యజ్ఞమునందు పశువధకు అవకాశం కలిగింది. ఆలభతీ అనగా ధాతు పాఠ ప్రకారమూ 'ప్రాప్తి'. 'సంజ్ఞపనం' అనగా జ్ఞానముతో ఐక్యము అని సోమయాజుల వారు ఈ రెండు పదాలకూ అర్థాన్ని చెప్పి, వేదముల సహాయమున శబ్దమును సరిగా గ్రహింపక పోవుటే యిటువంటి ప్రమాదము నకు కారణమన్నారు.

"వేదము మనకు ఒక ముఖ్యాంశ మును బోధించుచున్నది. మనము విదేశీ యులచే పరిపాలింపబడలేదని చెప్పు

చున్నది. విక్టోరియామహారాణి విదేశీయు రాలు గాదు. ఆమె మన ఆర్యసంతతికి చెందినదే. వేల సంవత్సరాలకు ముందు విడిపోయిన ఆర్యసంతతుల మెల్ల తిరిగి నేడు గలియుట భాగ్యము గాన మన హైందవులునూ పాశ్చాత్తులునూ ఒకరి నొకరు సోదరభావముతో జూచుచూ నొకరి నొకరు ప్రేమించు చుండవలసి ఉన్నది. మాక్సుముల్లరంతటి వారే మనమెల్లర 'మార్యు'లమనియు, మన బంధువర్గమెల్ల హిందూదేశముననున్న దనియూ జెప్పి యున్నారు. అందువలన మనము బంధువులచే పాలింపబడుచున్నారము. సభానాయకుడును, ఇచ్చటనున్న పాశ్చాత్య స్త్రీలును, సోదర సోదరీమణులే. మన జాతికి చెందిన వారే మనలను పరిపాలించు చుండుట సంతోషదాయకము అని చెప్పి, ఇంగ్లీషువారూ మనమూ, విభేదములు రాకుండా సామరస్యముతో మెలగుటకు సోమయాజులవారు అనాడు కృషి చేశారు.

జ్ఞానము ప్రథమమున ఆర్యావర్తన మున గల మహర్షులకు విశదీకరింపబడెను. అర్యులలో ఒక తెగవారు హిందూదేశమును విడచి, పశ్చిమ దిశకు వెడలిరనియూ అనుమాన రహితంగా విశదీకరింపబడినది. ఇప్పటి ఇంగ్లీషువారు ఈ అర్యులసంతతి వారే అనికూడ ఈయన తమ వేదోపన్యా సాలలో వింగడించారు. పై వాక్యాలు సోమయాజులవారి హృదయ విశాలతకూ, సహృదయతకూ తార్కాణాలు.

సోమయాజుల వారికి ఈశ్వరధ్యానం మీద విశ్వాసం ఎక్కువ. ఏవిధమగు విపత్తు వచ్చినా, ఆపద వచ్చినా, అడ్డం కులు ఎదురైనా వాటిని తొలగించు కొనుటకు పరమేశ్వర ధ్యానము చేసేవారు. శ్రీసూక్త, పురుష సూక్తాలను సస్వరముతో, సభక్తితో అనుదినమూ పఠించేవారు. సోమ యాజులవారు పద్దకొండేండ్ల వయస్సులో ఉన్నపుడు అంటే 1864 రక్తాక్షినామ సంవత్సరం కార్తీక మాసములో ఒక పెద్ద ఉప్పెన వచ్చి నూజివీడు పట్టణాన్ని ముంచివేయనుండగా వీరు ఈశ్వర ధ్యానముచేసి ఆ పట్టణవాసులకు ఉప్పెన వల్ల ముప్పు లేకుండా చేశారు. నూజివీడు పట్టణము వీరి జన్మస్థలము. కృష్ణాజిల్లాకు చెందినది.

సోమయాజులవారు 'వేదార్థ ప్రకాశిక' అను ఒక మాసపత్రికను 1901లో ప్రచురించడం ప్రారంభించారు. శ్రీ సంవత్సరం మీం మాఘకృష్ణ ప్రతిపత్ భృగౌ మహా మహోపాధ్యాయ', అను ఒక శ్లోకం ఈ పత్రికా సంచిక ఒకదానిలో ఉంది. పత్రికా ప్రచురణను ప్రశంసిస్తూ వ్రాయబడిన శ్లోకం ఇది. "1901 వరకూ కాశీ ప్రాంతములో విక్రమశకం వాడుకలో ఉంది అని చెప్పే వారు తమ వాదానికి ఆధారముగా ఈ శ్లోకాన్ని చూపుతారు.

సోమయాజులవారు గొప్పసంఘ సంస్కర్త. స్త్రీ పునర్వివాహఉద్యమానికి కందుకూరి రేశలింగం గారిని ప్రోత్స హించిందీ, సన్నద్ధులను చేసిందీ, అండగా నిలిచిందీ సోమయాజులవారే. 'ఒకసారి వివాహం జరిగినస్త్రీకి తిరిగి వివాహం చేయకూడదు" అని అనాటి బ్రాహ్మ ణ్యము గగ్గోలు చేస్తూ కందుకూరు వారిపై దండెత్తి రాగా ఈయన అపుగా నిలబడడమే

కాక, స్త్రీకి పునర్వివాహం చేయడము శాస్త్రసమ్మతమే అని అనన్యసామాన్యమైన తన శాస్త్ర విజ్ఞానముతో, ప్రచండ వాగ్ధాటితో నిరూపించి. వారి నోర్లకు తాళం వేశారు

స్త్రీ పునర్వివాహాన్ని ఆక్షేపించిన శ్రీ విరూపాక్షశంకరస్వాముల నిరంకుశత్వాన్ని ఖండించి, మద్రాసు హైకోర్టు ద్వారా రూ. 200/- లు జుల్మానా వేయించారు తాను తలపెట్టిన స్త్రీ పునర్వివాహ ఉద్యమ సాఫల్యతకు సోమయాజుల వారు తమకు ఎంతగా సహకరించిందీ కూడ కందుకూరి వీరేశలింగంగారు . తమ స్వీయచరిత్రలో స్వయంగా వ్రాసుకొన్నారు. కందుకూరివారు తమ స్వీయచరిత్రలో వ్రాసుకొన్న విషయాలను పరిశీలిస్తే సోమయాజులవారి సహకారం అందకుంటే, స్త్రీ పునర్వివాహ ఉద్యమంలో కందుకూరి వారు సఫలీకృతులు కాలేరు అను అంశం స్పష్టమౌతుంది. కాకినాడ జమీందార్లు శ్రీ పైడా రామకృష్ణయ్య గారిని ప్రోత్సహించి, కందుకూరివారు రాజమండ్రిలో స్థాపించిన వితంతూవివాహసమాజానికి ఆరోజుల్లో పదివేల రూపాయలు విరాళాన్ని ఇప్పించారు. 1869లో సోమయాజులవారు రాజమండ్రిలో ఉపాధ్యాయులుగా పని చేశారు. అప్పుడు వీరేశలింగంగారు వీరివద్ద ఆంగ్లము నేర్చుకొన్నారు.

పాణ్యంలక్ష్మీనృసింహశాస్త్రిగారు లక్ష్మీనృసింహసోమయాజిచరిత్ర అనీ, యమ్మనూరుశివరామయ్య కవి యజ్ఞాభివర్ణము అనీ 'శ్రీ మద్దరితకులకలశజలధిరాకా సుధాకరాయణ' అను బిరుదుగల వెంకటరామానుజాచార్యులవారు 'లక్ష్మీనృసింహ సవనవిలాసము' అనీ సోమయాజులవారి చరిత్రను పద్య కావ్యాలుగా వ్రాశారు. రాజవైద్య గ్రంధి సుబ్బరాయశర్మ గారు వీరి చరిత్రను నాటకంగా వ్రాశారు. సోమయాజులవారు 25-8-1845న జన్మించారు. 13-6-1901న స్వర్గస్తులయ్యారు.

*(శ్రీ సోమయాజిగారి 152వ జయంతి శుభసందర్భంగా 25-8-1997వ తేదీన కడప ఆకాశవాణీ కేంద్రంవారు ప్రసారం చేశారు)*

## ఇది కలికాల మహిమ కావచ్చు

శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారూ!

ఈమధ్య మీచే (వి)నాయకులైన వారితో మీకు సమస్యలు (సంఘవ్యవహారాలలో) ఎదురైనట్లు ప్రబోధినిలోని వార్తలవల్ల తెలియుచున్నది. ఇదిఎంతయూ కలికాల మహిమ. చాలావిచారకరము. ఇది మీ ఒక్కరి విషయములోనే కాదు. ప్రతి సంఘములోనూ. సంఘశ్రేయస్సుకు విరుద్ధముగా పనిచేయువారే సంఘనాయకులుగా ఎన్నిక కావడము ఈనాడు సర్వసాధారణము. రాజకీయాలలో ఈపద్ధతి ఎప్పటి నుండియో ఉన్నది. ఈ అంటువ్యాధి AIDS లాగా అన్నిసంఘాలకు వ్యాపించినది. తత్ఫలితంగా ఏ సంఘమును కూడ నమ్ముటకు వీలులేని పరిస్థితి ఏర్పడినది. ఏ సంఘము ఎప్పుడు బకాసురుల చేతిలో పడుతుందో చెప్పలేని పరిస్థితి దాపురించింది.

సివి. సత్యనారాయణ శ్రేష్ఠి,
అడ్వొకేట్, నంద్యాల.
24-9-97.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 అక్టోబరు 21 నుండి 1997 నవంబరు నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 26 | 2 | 9 | 16 | |
| సోమవారము | | 27 | 3 | 10 | 17 | |
| మంగళవారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| బుధవారము | 22 | 29 | 5 | 12 | 19 | |
| గురువారము | 23 | 30 | 6 | 13 | 20 | |
| శుక్రవారము | 24 | 31 | 7 | 14 | | |
| శనివారము | 25 | నవంబరు 1 | 8 | 15 | | |

అక్టోబరు 24 :- స్వాతికార్తెరాక ప. 2-27
అక్టోబరు 29 .- నరకచతుర్దశి
అక్టోబరు 30 - దీపావళి
అక్టోబరు 31 :- పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1997 సెప్టెంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేటుమెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు

చివరితేది.

అక్టోబరు 31 :- 1996 సెప్టెంబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారమును అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

అక్టోబరు 31 :- కో-ఆపరేటివ్ సొసైటీలు, నాన్-కార్పోరేట్ అసెసీలు, ఆదాయపుపన్ను చట్టము లేక ఏ ఒక్క ఇతరచట్టముక్రింద తమ అకౌంట్లను ఆడిట్ చేయించవలసిన అసెసీలు 1997-98 అసెస్‌మెంట్ సంవత్సరానికి దాఖలు చేయవలసిన ఆదాయపు పన్ను లేక సంపదపన్ను రిటర్నులను అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

అక్టోబరు 31 :- నాన్-కార్పోరేట్ అసెసీలు ఆదాయపుపన్ను చట్టములోని 44AB సెక్షనుల క్రింద దాఖలు చేయవలసిన 1997-98 అసెస్‌మెంట్ సంవత్సరానికి ఆడిట్ రిపోర్టును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

అక్టోబరు 31 :- ఇతర చెల్లింపులనుండి TDS పట్టుకొన్నవారు 1997 ఏప్రెల్ 1వ తేదీతో ప్రారంభమై 1997 సెప్టెంబరు 30వ తేదీతో ముగియు అర్ధసంవత్సరపు రిటర్నును 27EA, 27EB, 27EC, 27ED ఫారములలో తమకు అన్వయించిన దానిలో దాఖలు చేయుటకు చివరితేది.

నవంబరు 1 :- ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రావతరణ. దుకాణాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతములోకూడిన సెలవుదినము

నవంబరు 1 :- కార్తీక స్నానారంభం

నవంబరు 2 :- భగినీహస్తభోజనదినము. గమనిక : ఈరోజు అక్కచెల్లెండ్రు గల సోదరులు తమ అక్కలేక చెల్లెలి ఇంటికివెళ్ళి ఆమెచేతి భోజనం తినమంటుంది శాస్త్రము.

నవంబరు 6 :- విశాఖకార్తెరాక రా. 9-36.

నవంబరు 14 :- కార్తీకపౌర్ణమి - నెహ్రూజన్మదినము - గురునానక్ జయంతి.

నవంబరు 15 :- చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించువర్తకులు చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరిరోజు.

నవంబరు 19 :- అనూరాధకార్తె రాక రా. 2-26

నవంబరు 20 :- A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు ఆఖరితేది.

**..., 9, 16, ఆదివారాలు**

- *నన్ను మీ టేబు[illegible]ంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# చలమన్న ఇకలేడు

మనందరితో 'చలమన్న' అని - ఎంతో ఆత్మీయతతో పిలిపించుకొన్న చలమన్న 10-9-97వ తేదీన మనపై అలిగి స్వర్గాన్ని చేరుకున్నారు.

చలమన్నది చక్కని వ్యక్తిత్వం. పరమ శాంతమైన ముఖం. నిజమైన కార్యకర్త అంటే ఆయనకు ఎనలేని గౌరవము. అత్యంత అభిమానం. మోసం, ద్రోహం అనేపదాలు ఈయన జీవిత నిఘంటువులో కన్పించవు.

స్వకులాభ్యున్నతికి జరిగే కృషిలో ఈయనెంతో ఉత్సాహంగా పాల్గొనేవారు. కొన్నాళ్ళు ఆయన రాజకీయరంగములో కొంతపాత్రను పోషించారు. అయినా ఆ వాసనలు ఆయనకు అంటలేదు. కులము, విషయములో రాజకీయాలు చొప్పించే వారంటే ఈయనకు మహాచిరాకు..

'చలమన్న' అంటే అనంతపురం జిల్లా హిందూపురం పురపాలక సంఘానికి మాజీ ఆధ్యక్షులు శ్రీ యం.వి.వి. చలంగారు. హిందూపురంఆర్యవైశ్యసంఘానికీ, హిందూపురం [illegible]చివల్‌బెనిఫిట్‌ఫండ్‌కూ చల వ[illegible]క్షులుగా వ్యవహరించారు. వాటి [illegible]కి మంచికృషి చేశారు. చలమన్న లేనిలోటు ఈతరం వైశ్యులకు పెద్దలోటు.

ఇప్పటి వైశ్యనాయకుల లాగా చలమన్న స్వకులసభల్లో ఎప్పుడూ, రాజకీయాలు మాట్లాడేవారు. ఇటువంటి నిబద్ధత ఉండాలంటే మనిషిలో సంస్కారం గొప్పగా ఉండాలి. అది కొందరికే సాధ్యం. బాధ్యత మరచి సాధ్యాసాధ్యాలను గమనించక రాజకీయ విషయాలు మాట్లాడడం తానేదో సాధిస్తానని ప్రజల్ని మభ్యపెట్టడమే.

# ఈ వైజములో మార్పు ఎప్పుడో?

సమాజావసరాలకు అనుగుణంగా యే సంఘమైనా కార్యక్రమాలను రూపొందించాలి. అప్పటికీతగినస్పందన ఆసమాజము నుండీ రానప్పుడు సంఘముయొక్క ఉనికి నిష్ప్రయోజనమౌతుంది. సంఘాలకు మేమే పెద్దలము. అధ్యక్షులము. కార్యదర్శులము - అని చెప్పుకొంటూ భుజకీర్తులూ, కిరీటాలూతగిలించుకొని ఫోజులు పెట్టూ ఉంటే సమాజానికి కలిగేమేలు సున్న. అలా - అలా చెప్పుకోవడం శాలువాలు కప్పించుకొనేందుకూ - కార్లల్లో తిరిగేందుకూ అత్రమే బలే బలేగా ఉపయోగపడుతుంది.

1975లో కనగానిపల్లెలో జరిగిన ధర్మవరం తాలూకా ఆర్యవైశ్యసభల్లో శ్రీ బి. వెంకట సుబ్బయ్యగారు మాట్లాడుచూ, ధర్మవరముపట్టణవైశ్యసంఘము పని చేయని సంఘము అనీ, ఒకరకంగా అది మృతసంఘముఅనీ అన్నందుకు ధర్మవరమువారు శ్రీ వెంకటసుబ్బయ్య గారిని కొట్టడానికి వచ్చారు. తెల్లవారుఝాము వరకూ సాగిన ఆనాటి ఆలోచనలు, ధర్మవరము పట్టణములో వైశ్యవిద్యార్థుల వసతి గృహానికి నాందీకాగలిగాయి. ఈ విషయము అక్కడ ఆనాడు ఉన్నవారందరికీ తెలుసు.

ఈనాడు పెద్దలు సాటివైశ్యుడు దురదృష్టవశాత్తు వీధినబడక తప్పని పరిస్థితులు ఏర్పడి - ఆదరించమని వస్తే రేపు - మాపు అంటూతమచుట్టూ ప్రదక్షిణలు చేయించుకొంటూ సాటివాడుకదా అనికూడా ఆలోచించక 'రెంటికి చెడ్డరేవణి'గా మార్చుచున్నారు. నేనువాసవీపుత్రుడను. వైశ్యుడను అని ఒక ప్రక్క చెప్పుకొంటూ ప్రక్కనున్నవాని కన్నుపొడిచి తమాషాగా

చూస్తున్నారు. ఈ నైజము ఎప్పుడు మారుతుందో కదా?

మేడా అశ్వర్థనారాయణగుప్త
హిందూపురం, 20-9-97

## శ్రీ కొత్తూరి స్వర్గారోహణ



గుండె బిగువుతో కొండల్ని సైతమూ ఢీకొనగలిగిన శ్రీ కొత్తూరు వెంకటేశ్వర్లుగారు 7-9-97న స్వర్గస్తులు కావడము వైశ్య సంఘానికి తీరనిలోటు.

కొత్తూరి నిష్కపటి. నిరాడంబరుడు. 20-6-1927లో గుంటూరుజిల్లా నర్సరావుపేటలోని ఒక సామాన్య కుటుంబములో జన్మించిన కొత్తూరి స్వయంకృషితో - పట్టుదలతో శ్రమించి హేమాహేమీలను సైతము ఢీకొని నర్సరావుపేట పురపాలక సంఘానికి అధ్యక్షులు కాగలగారు. త్రాగు నీటికి కటకటలాడే నర్సరావుపేట లోని ప్రజలకు స్వంత ధనమును వెచ్చించి నాగార్జునసాగర్ నుండీ లారీలలో నీటిని తెప్పించి సామాన్యప్రజలచే అపరభగీరథుడుగా పిలవబడ్డాడు. ఒక రాష్ట్ర ముఖ్య మంత్రిగా, ఒకబలమైననాయకుడుగా ఆరోజుల్లో పేరు 'ప్రతిష్ట' అంతకుమించిన ధనబలంకల శ్రీకాసుబ్రహ్మానందరెడ్డి గారితో పోటీ చేసి ఆయన్ను ముప్పు తిప్పలు పెట్టినవ్యక్తి శ్రీ కొత్తూరి.

అనారోగ్య ఫలితంగా ఏర్పడిన నిస్సంతువవల్ల ఆయన నడవలేకపోతే "మా కొత్తూరికి కాళ్ళుపోయాయి మా అందరి కాళ్ళూ పోయాయి" అంటూ నాతో ఆపట్టణ వైశ్యప్రముఖులు కొందరుచెప్పారంటే కొత్తూరి నర్సరావుపేట పట్టణ వైశ్యులకు ఎంతటి, అండో - ఆదరణో ఊహించ వచ్చు.

కొత్తూరి కూడ రాజకీయ నాయకుడే అయితే కులం విషయంవస్తే అందులో రాజకీయాలు చొప్పించి తన ప్రాముఖ్యతను పెంచుకోవాలనీ కానీ - ఏదో పదవిని సంపాదించుకోవాలనికానీ ఆయన ఎప్పుడూ ఆలోచించలేదు. కొత్తూరికి ఎత్తులూ - జిత్తూలూ తెలియవు. వైశ్యలకు జరిగే అన్యాయాలను ఆయన ధైర్యముతో ఎదుర్కొనేవారు. ఈతరం వైశ్యులకు కొత్తూరి మంచిశక్తిమంతుడగు నాయకుడు.

21-9-97 నర్సరావుపేటలోని శ్రీ కోదండ రామస్వామి దేవాలయములో పెద్దఎత్తున సంతాపసభ జరిపి పలువురు ప్రముఖులూ - అభిమానులు ఈయనకు శ్రద్దాంజలి ఘటించారు.

## స్కాలర్‌షిప్పులకు దరఖాస్తులు పంపండి

- అవోపా విద్యానిధి, కడప.

గతసంవత్సరమువలెనే ఈ సంవత్సరమూ పై అవోపా, సాంకేతిక విద్య నభ్యసిస్తూ ఆర్థికంగా వెనుకబడిన ఆర్యవైశ్య విద్యార్థినీ విద్యార్థులకు ఉపకారవేతనము (స్కాలర్ షిప్పులు)లు ఇచ్చుటకు ఆర్య వైశ్య విద్యార్థినీ విద్యార్థునుండీ దరఖాస్తులు కోరుచున్నది. పూర్తిచేసిన నిర్ణీత దరఖాస్తు ఫారమును 25-11-97వ తేదీలోగా చేరునట్లుగా శ్రీ గుండానారాయణశ్రేష్ఠి, 5/313, సి.వి.రావువీధి, కడప- 516001.కు పంపాలి. పై అడ్రసుకు మణి యార్డరు, ద్వారా రూ. 10/-లు పంపి దరఖాస్తు ఫారాన్ని పొందాలి.

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము - శ్రీ పి కాంతం శ్రేష్ఠి (సంపాదకులు)

(గత సంచిక తరువాయి)

నేను 'సమాధి' అను పేరుగల వైశ్యుడను. ధనవంతుల ఇంటిలో పుట్టిన వాడను. ధనముమీద దురాశతో అసాధు వృత్తిని అవలంబించి నా భార్య, పుత్రులు నన్ను విడనాడిరి. నా ధనమును అపహరించి, నన్ను తరిమివేసిరి. భార్యాపుత్రులను, ధనమును కోల్పోయి, ఆప్తబంధువులచే విడనాడబడి దుఃఖోపహతుడైన నేను ఈ అడవికి వచ్చితిని. ఇచట ఉండుటచేత నా కుమారుల యొక్కయూ, స్వజనము యొక్కయూ, భార్య యొక్కయూ, కుశల, అకుశలములు నాకు ఏమీ తెలియుట లేదు. ఇంటివద్ద వారిప్పుడు క్షేమముగ ఉన్నారా? క్షేమమును పోగొట్టుకొని, దుర్దశను అనుభవిస్తున్నారా? వారిప్పుడు ఎట్లుఉన్నారు? నా సుతులు సత్ప్రవర్తనులై ఉన్నారా? దుష్ప్రవర్తనులై ఉన్నారా? అని సమాధి తన వృత్తాంతమును చెప్పెను.

20 - 25 అ.1 - పుట 8 దే.మ.

లోభముచే నీ ధనమును అపహరించి నిన్ను నిరసించిన నీ పుత్రులు, భార్యాదుల మీద నీ మనస్సు ఏల స్నేహబంధము కలిగిఉన్నది? - అని రాజు సమాధిని తిరిగి అడిగెను.

26 - 28 అ.1 - పుట 8 దే.మ.

మీరు ఇప్పుడు ఎట్లు పలికితిరో అట్లే, ఆ భావమే, నాకును కలిగినది. నేను ఏమి చేయగలను. నా మనస్సు కఠినమును వహించకున్నది. ధనముమీద పేరాశచేత తండ్రిమీద నెయ్యమును, స్వజనుల యందు ప్రేమను, పూర్తిగా విడిచి, భర్తను అగు నన్ను వెడలగొట్టిన వారిమీదే, మనస్సు గాఢమైన అనురాగాన్ని కలిగి ఉన్నది. ఇది తెలిసీ నేను దోషమని గ్రహింపలేకున్నాను. ఉదారహృదయముగల ఓరాజా! బంధువులు దుర్గుణములు కలవారే అయినను చిత్తము వారియెడ ప్రేమాయత్తమై ఉన్నది. ఏమి విచిత్రమో! వారికై నేను నిట్టూర్పులు విడుచుచూ, దుఃఖాన్ని పొందుచున్నాను. నా పై ప్రీతిలేని వారియెడల నా మనస్సు నిష్ఠురత్వమును పూనకున్నది. నేను ఏమి చేయగలను? అని వైశ్యుడు పలికెను.

29 - 34 అ.1 - పుట 9 దే.మ.

మార్కండేయుడు పలికెను. 'ఓ విప్రా! సమాధిపేరుగల ఆ వైశ్యుడూ, ఆ రాజసత్తముడూ కూడి మేధసముని వద్దకు వచ్చి, సముచితములగు మర్యాదలు చేసిన పిదప, కూర్చుండి, అనేక విషయములను గూర్చి అయనతో ప్రసంగించిరి.

35 - 38 అ.1 - పు 10 దే.మ.

రాజు పలికెను. భగవాన్! మిమ్ములను ఒకటి అడగాలి అని అనుకొంటున్నాను.

దానికి దయతో సమాధానమును చెప్పుడు నా మనస్సు నా చిత్తమునకు అధీనము కాక, దుఃఖవశమై ఉన్నది. నేను రాజ్యమును పోగొట్టుకొనియూ, అజ్ఞానివలె - నాకది తెలిసికూడ - రాజ్యాంగము లన్నిటిలో నాకు మమత్వము నిలిచి ఉన్నది మునిసత్తమా! ఇది ఎట్లు? ఇతడు కూడ తన భార్యవలనా, పుత్రులవలనా, భృత్య జనులవలనా, స్వజనమువలనా, తిర స్కృతుడై వారిని విడిచివచ్చియూ, వారి యెడలనే మిక్కుటమైన ప్రేమను కలిగి ఉన్నాడు ఈ విధముగా ఇతడునూ, నేనునూ ఆ విషయములందు గల దోషములను చూచుచునే, మమత్వము చేత వానివైపుకు ఆకర్షింపబడి అత్యంత దుఃఖితులమై ఉన్నాము. నిర్మలచిత్తుడా! తెలిసిన వారము అగు నాకునూ, ఈతనికీ ఈ మోహముకలిగినదే? మాకుగల వివేకమును పోగొట్టి మూఢులను చేసినదే! ఇదిఎట్లు?

39 - 45 అ.1 - పుట 11 దే.మ.

ఇంద్రియయములకు కనిపించు విషయజ్ఞానము సమస్తజంతువులకూ కలదు. ఇంద్రియ విషయములు వేరువేరు విధముగా వానికి తెలియవచ్చును. కొన్ని ప్రాణులు పగటిపూట చూడలేవు. మఱికొన్ని ప్రాణులు రాత్రిపూట చూడలేవు. మరికొన్ని ప్రాణులు రాత్రీ పగలూ చూడగలవు. మనుజులకు జ్ఞానము ఉండుట నిజమే కానీ, అది కేవలము వారికిమాత్రమే కలది కాదు. పశువులకూ, పక్షులకూ, మృగము లకూకూడ జ్ఞానము అనగా ఇంద్రియ విషయమైన జ్ఞానముకలదు.

46 - 49 అ.1 - పుట 11 దే.మ

మనుష్యులకుగల జ్ఞానము మృగము లకూ, పక్షులకూ కూడ కలదు వానికిగల జ్ఞానము మనుష్యులకూ కలదు తక్కినవి (నిద్ర, భోజనము మొదలగునవి) రెండు జాతులకూ సమానముగానే ఉన్నవి. ఆ పక్షులవంక చూడుము. వానికి జ్ఞానము ఉండీ, తాము ఆకలితో బాధపడుచూ ఉండీ, మోహమునకు చిక్కి, తమ పిల్లలముక్కులలో అనగా (నోళ్ళలో) గింజలను పెట్టుచున్నవి. ఓ 'మనుష్యశ్రేష్ఠా! ప్రత్యుపకారము కలుగగలదు' అను - ఆశతో మానవులు తమబిడ్డలయెడ కోరికను కలిగిఉందురు. నీకుఇది కనిపించుట లేదా? అట్లయ్యునూ సంహార స్థితిలయ కారిణిఅగు మహామాయ యొక్క ప్రభా వముచేత మానవులు 'మమత' అను సుడి గుండములోనూ, 'మోహము' అను గుంటలోనూ పడుచున్నారు. ఇందు లకు ఆశ్చర్య పడవద్దు. ఈ మహామాయ జగత్పతి అగు విష్ణుదేవుని యొక్క యోగనిద్ర. (విష్ణు దేవుని తామసికశక్తినే యోగనిద్రఅందురు.) ఆమెచేత జగత్తు సమ్మోహిత మగుచున్నది. ఆ దేవి, ఆ భగ వతి, ఆ మహామాయయే సుమా! జ్ఞానుల మనుస్సులనుకూడ ప్రబలముగా ఆకర్షించి, వారిని మోహగ్రస్తులుగా చేయుచున్నది. ఈ చరాచరరూపజగత్తునంతా ఆమే సృజించుచున్నది. ఆమె అనుగ్రహించినచో నరులకు ముక్తిని ఇచ్చువరదాయిని.

అగును. ఆమే పరావిద్య. ముక్తికి కారణము. శాశ్వత సంసార బంధమునకు ఆమే కారణము. ఈశ్వరుల ఎల్లరునూ. పరిపాలించు పరమేశ్వరి ఆమే.

51 - 58 అ.1 - పుట 12, 13-14 దే.మ.

భగవాన్! మహామాయ అని నీవు చెప్పుదేవి ఎవరు? ఆమెఎట్లు ఉత్పత్తి అయ్యెను. ఆమె ఏమిచేయును. ఓ బ్రాహ్మణుడా! అమె స్వభావము ఎట్టిది? ఆమెస్వరూపము ఎట్లుండును? ఆమె ఎచ్చటనుండీ ఉద్భవించెను? ఇదంతా బ్రహ్మజ్ఞానులలోశ్రేష్ఠుడ వగు నీనుండీ వినగోరుచున్నాను - అని ఆ రాజు పలికెను.

59 - 62 అ.1. - పు 14 దే.మ.

ఆ ఋషి దేవీతత్వమును, దేవీమహిమ లను వారికి వివరించెను.

ఓ రాజా! దేవియొక్క ఈ శ్రేష్ఠమగు మహాత్మ్యమును నేను నీకిప్పుడు తెలిపితిని.

1 - 2 అ.13 - పు 161 దే.మ.

దేవి అట్టి ప్రభావసంపన్నురాలు. ఈ జగత్తును భరించునది ఆమెయే - అట్లే విద్య (జ్ఞానము)ను ఇచ్చునదీ భగవంతు డగు విష్ణుదేవుని మాయా ఆమెయే.

3 - అ.13 - పుట 3 దే.మ.

ఆమెచేత, నీవునూ, ఈ వైశ్యుడునూ వివేకవంతులగు ఇతరులునూ అజ్ఞానమున పడుచున్నారు. ఇతరులును (పూర్వము) పడిరి. (ఇకమీదట) పడుదురు.

4 - అ.13 - పుట 3 దే.మ.

ఓ మహారాజా! ఆ పరమేశ్వరి వద్ద శరణుపొందుము. తనను పూజించువారికి ఆమె భోగమునూ, స్వర్గమునూ, మోక్ష మునూ ప్రసాదించును.

5 - అ.13 - 162. దే.మ.

మార్కండేయుడు తన శిష్యుడు భాగురితో పలికెను. ఓ మహామునీ! అత్యంత మమకారము వలననూ, రాజ్య భ్రంశమువలననూ దుఃఖితులైఉన్న ఆ సురధనరపాలుడూ, ఆ వైశ్యుడూ ఆ పలుకులు విని తీక్షవ్రతతత్పరుడు అను పేరును పొందిన ఆ ఋషికి ప్రణామములు చేసి తపస్సును చేయుటకు వెంటనే బయలుదేరి వెళ్ళిరి

6 - 8 అ.13 - పుట 162 దే.మ.

అంబను చూడవలెనన్న కోరికగల ఆవైశ్యుడూ, ఆ రాజూ ఒకనది ఇసుకదిబ్బపై కూర్చొని శ్రేష్ఠమగు దేవీసూక్తమును జపిస్తూ తపస్సును చేసిరి

9 - అ.13 పుట 162 దే.మ.

మట్టితో ఒకదేవీ విగ్రహమును చేసి, వారు ఇర్వురూ ఆ ఇసుకదిబ్బపై పూవుల తోనూ, ధూపముతోనూ, అగ్నితోనూ, జల తర్పణముతోనూ ఆమెను అర్చించిరి.

10 - అ.13 పుట 163 దే.మ.

ఆహారమును తీసుకొనక కొన్నాళ్ళూ, కొద్దిఆహార మును తీసికొనుచూ కొన్నాళ్ళూ, మనస్సులను ఆమె అందే నిలిపి, ఏకాగ్ర బుద్ధితో వారిర్వురూ తమ శరీరరక్త బిందువులతో తడిసిన బలులను సమ ర్పించిరి.

11 - అ.13 - పుట 163

ఇట్లు, మనోనిగ్రహముతో పడమూడు ఏండ్లు ఆరాధింపగా ఆ లోకసంరక్షకురాలు, చండిక సంతుష్టినిపొంది ప్రత్యక్షమై వారికి ఇట్లుచెప్పెను.

12 - అ.13 - పుట 163 దే.మ.

ఓ రాజా! కుటుంబహర్షకారకుడవగు ఓ వైశ్యా! మీరు కోరినవి అన్నింటినీ నా వద్దనుండీ తీసికొనుడు. సంతుష్ఠరాలనై మీకు వానిని ఇచ్చుచున్నాను - అని ఆ దేవిపలికెను.

13 - 15 అ.13 - పుట 163 దే.మ.

అంతట ఆ రాజు మరియొక జన్మమునకూడ తొలగి పోకుండు రాజ్యము లభించునట్లునూ, ఈ జన్మమున తన శత్రువుల బలమును బలాత్కారముగా నశింపజేసి, తన రాజ్యమును మరలా పొందునట్లునూ కోరుకొనెను

16 - 17 అ.13 - పుట 164 దే.మ.

విరక్తచిత్తుడునూ, ప్రాజ్ఞుడునూ అగు ఆ వైశ్యుడు (సమాధి) మమత అహంకార రూపమగు (నేను, నాది అనుభావమును కల్పించు) సంగమమును పోద్రోలునట్టి జ్ఞానమ్మును కోరుకొనెను - అని మార్కండేయుడు పలికెను.

18 - అ.13 - పుట 164 దే.మ.

ఓ రాజా! కొలదిదినములలో నీ శత్రువులను వధించి, నీవు నీ రాజ్యమును పొందుదువు. అది తొలగిపోక అచటనే నీకు నిలిచి ఉండును.

19 - 21 అ.13 - పుట 164

నీవు చనిపోయిన తర్వాత దేవుడు అగు వివస్వంతుని (సూర్యుని) వలన మఱొక పుట్టుకను పొంది, 'సావర్ణి' అను పేరుతో భూమిపై మనువు అగుదువు.

22 - 23 అ.13 165 దే.మ.

ఓ వైశ్యశ్రేష్ఠా! నీవు కోరుకున్న వరమును నీకు ఇస్తున్నాను. సంసిద్ధిని (ఆత్మ సాక్షాత్కారము) కలిగించుజ్ఞానము నీకు లభించును. - అని దేవిపలికెను.

24 - 25 అ.13 పుట - 165 దే.మ.

ఈ విధముగా వారు ఇరువురూ కోరిన వరములను పొంది అమెను భక్తి పూర్వకముగాస్తుతించిరి. ఆ దేవివెంటనే అంతర్ధానమయ్యెను.

26 - 27 అ.13 - పుట 165 దే.మ

ఇది స్కాంధ పురాణమందు, సనత్సుజాతీయసంహితగల ఉత్తరఖండము - సురథ, సమాధులచరిత్ర - 19వఅశ్వాసము.

## వర్తకులు ఆ పరిస్థితుల్లో లేరు

శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారికి -

వైశ్యప్రబోధిని వస్తూఉంది. అందులోని ఆదాయపుపన్ను విషయాలు చక్కగా, ప్రబోధాత్మకంగా ఉన్నాయి ఈ విధంగానే అత్యవసరవస్తువులచట్టము - (E C.Act) లోని వివరాలనుకూడ ప్రచురించండి

అత్యవసరవస్తువులచట్టం అమలు కాలపరిమితి ముగిసింది తిరిగి ఇంకా పొడిగించలేదు. సివిల్‌సప్లయిస్‌వారు వారికి అవకాశములు రాక విజయవాడలోని బియ్యపువర్తకులపై కేసులు పెట్టడం మొదలుపెట్టారు. విజయవాడచేంబర్ ప్రసిడెంట్ శ్రీ గద్దంసుబ్బరావుగారు హైదరాబాద్ వెళ్ళినారట. బాధితులు ఎవరూ మీకు తెలుపరు. కొన్ని వస్తువుల మీద 'టర్నోవర్ ట్యాక్సు'ను తీసివేసినట్లుగా దినపత్రికలలో వచ్చినదనివిన్నాను. రాలేదు అని అమ్మకం పన్నుశాఖాధికారులు అంటున్నారు. ఏమైనా వైశ్యప్రబోధినిలో వ్యాపారవిషయాలు చక్కగా ప్రచురిస్తున్నారు. సెప్టెంబరు సంచిక వివరములతో వచ్చినదానికి నా అభినందనలు. వర్తకులు ఎక్కువమంది వైశ్యప్రబోధినిలో సభ్యులుగా చేరితే, ప్రబోధినిని ఎక్కువపుటల్లో ప్రచురించవచ్చు. వర్తకులు ఆ పరిస్థితుల్లో లేరు. మీ కృషికి నా ధన్యవాదాలు.

నేరెళ్ళరంజ, మాజీ శాసనసభ్యులు,
ఏలూరు. 23-9-97

# సర్వీస్ ట్యాక్సు - దాని కథాక్రమం

కేంద్రప్రభుత్వము 1994ఆర్థిక చట్టములో ప్రతిపాదించిన ప్రకారము - 1994లో కేవలము మూడురకముల సేవలకు మాత్రమే వర్తించునట్లుగా 1994 జూలైనెల1వతేదీ నుండీ అమలుకు వచ్చునట్లు 'సర్వీస్‌ట్యాక్సు' అనుపేర సరికొత్తచట్టాన్ని ప్రవేశపెట్టింది. అవి

1. టెలిఫోన్‌సర్వీస్

2. నాన్‌లైఫ్ ఇన్సూరెన్సు

3. స్టాకుబ్రోకర్లు (గుర్తింపుపొందిన సబ్‌బ్రోకర్లతో గూడ గుర్తింపుపొందిన స్టాకు బ్రోకర్లు)

ఈ చట్టాన్ని విస్తరిస్తూ 1996లో మరో మూడు వ్యవస్థలపైనా - ఆతరువాత 1997 మరో 9రకాల సేవలపైనా సర్వీసు ట్యాక్సును విధిస్తూ భారతప్రభుత్వము ప్రధానచట్టాన్ని సవరించింది. అవి.

4. అడ్వర్టైజింగు ఏజెంట్లు లేక ఏజెన్సీలు

5. కొరియర్ సర్వీసులు

6. రేడియోపేజింగుసర్వీసులు

7.కస్టమ్సు హౌస్‌ఏజెంట్లు

8. స్టీమర్ ఏజెంట్లు

9. మండపాల (కీపర్లు) యజమానులు

అనగా, కళ్యాణమండపాలు, ఫంక్షన్ ప్యాలెస్‌లు, దేవాలయాలు, మసీదులు, వివాహాలు చేసుకొనుటకుగాను అద్దెకు ఇచ్చేట్రస్టుల ఆధ్వర్యములోని ప్రదేశాలు, కాన్ఫరెన్సుహాల్లుకలిగిన హోటళ్ళు.

10. ఎయిర్ ట్రావెల్ ఏజెంట్లు

11. కన్సల్టింగ్ ఇంజనీర్లు (హౌస్‌ప్లానర్లు, ఆర్కిటెక్‌లు మొదలగువారు)

12. సి అండ్ ఎఫ్ ఏజెంట్లు

13. పెండాల్లు, షామియానాలు అద్దెకు ఇచ్చేవారు

14. టూర్ ఆపరేటర్లు (1988 మోటారు వాహనాల చట్టము క్రింద 'టూర్‌పర్మిట్లు' కలిగి ఉన్నవాహన యజమానులందరూ)

15. అవుట్‌డోరు కేటరర్లు (వెలుపలి ప్రాంతాలకు ఆహారం సమకూర్చే వ్యక్తులు)

పై పదునైదు తరగతులకు చెందిన సేవలు అందించే కంపెనీలు, వ్యక్తులు వారు చేసే బిల్లుమొత్తము మీద రూపాయకు ఐదు (5)పైసల చొప్పున (ఐదు శాతము) సర్వీసుట్యాక్సు క్రింద కేంద్ర ప్రభుత్వమునకు పన్నును చెల్లించ వలసి ఉంది.

పై వాటిలో, మొదటి మూడురకాల సేవలపై 1994 జూలైనెల 1వతేది నుండీ పన్నును విధించారు.

తదుపరిగల మూడురకాల సేవలపై 1996 జూలైనెల 1వతేదీనుండీ పన్నును విధించారు.

ఆ పైగల 9 రకాల సేవలలో 13, 15 అంశాలకు చెందినవారు తప్ప మిగిలిన వారు 1997 జూలైనెల్ల 1వ తారీఖునుండీ సర్వీస్‌ట్యాక్సును చెల్లించాలి.

13, 15 అంశాలకు చెందినవారు అనగా పెండాల్లు, షామియానాలను అద్దెకు ఇచ్చేవారూ, అవుట్‌డోర్ కేటరర్లూ 1997

ఆగస్టు1వ తేదీ నుంచి ఈ 'సర్వీస్ ట్యాక్సు'ను చెల్లించాలి.

పై 15 అంశాలేకాకుండా 'గూడ్సు ట్రాన్సుపోర్టు ఆపరేటర్ల'ను కూడ ఈ సర్వీస్ ట్యాక్సు విధింపుపరిధిలోనికి తెచ్చినట్లూ, తెచ్చికూడ తాత్కాలికంగా అమలును నిలిపివేసినట్లూ తెలుస్తూంది.

పై పదునైదురకాలసేవలపై పన్నును అనగా 'సర్వీస్‌ట్యాక్సు'ను విధించుటకు వీలుగా చేయబడిన ఈ చట్టమును అమలుపరచి, వసూలుచేయు బాధ్యతను కేంద్రప్రభుత్వము సెంట్రల్ఎక్సయిజ్ డిపార్టుమెంటుకు అప్పగించింది. అందు వలన పై పదునైదుతరగతులక్రిందికి వచ్చేవారు తమ ప్రాంతముపై అధికారము కల సెంట్రల్ఎక్సయిజ్‌కమీషనరుగారి కార్యాలయములో తప్పక రిజిస్టర్డు చేసు కొని - వారి, వారి మాసవారీ వ్యాపార మొత్తముపై రూపాయకు ఐదుపైసల ప్రకారమూ (ఐదుశాతము) స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా లేక స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాదులలో ప్రతినెల 15వ తేదీలోగా జమచేయాలి. ఉదాహరణకు : అక్టోబరు నెల వ్యాపార మొత్తముపై చెల్లించవలసిన పన్నును నవంబరు 15వ తేదీలోగా చెల్లించాలి. అంటే నెల గడచినతర్వాత వచ్చే 15వ తారీఖులోగా. అట్లు జమచేసిన మొత్తాల వివరాలను ప్రతిమూడు నెలలకూ ఒకసారి నెలవారీ టర్నోవరూ - ఆ టర్నోవర్‌పై బ్యాంక్‌లో జమచేసిన పన్నుమొత్తాల వివరాలనూ, వారి, వారి వ్యాపారస్థలముపై అధికారముగల సెంట్రల్ ఎక్సయిజ్‌అసిస్టెంట్‌కమీషనరు గారికి S.T-3 ఫారములో తప్పక తెలపాలి-

ఈ చట్టము క్రింద రిజిస్టరు చేయించు కొనుటకు S.T-1 అనుఫారమును ఉపయోగించాలి. సెంట్రల్ఎక్సయిజ్ డిపార్టుమెంటువారి నడిగితే ఈ ఫారాన్ని ఇస్తారు. ఫారమును పొందుటకుగానీ, రిజిష్టరు చేయించుకొనుటకుగానీ ఏమీ చెల్లించనక్కరలేదు.

సెంట్రల్ఎక్సయిజ్‌కమీషనరువారు S.T-2 అనుఫారములో 'రిజిస్ట్రేషన్ సర్టిఫికేట్'ను ఇస్తారు.

సర్వీస్‌ట్యాక్సును చెల్లించని వ్యక్తులు లేక సంస్థలు వారులేక ఆ సంస్థ చెల్లించ వలసిన పన్నుమొత్తమూ, ఆ మొత్తముపై చెల్లించవలసినవడ్డీ ఆ రెండింటినీ కలిపితే అయ్యే మొత్తమును జరిమానాగా చెల్లించవలసి ఉంటుంది. దీనికి తోడు జరిమానాగా ఆలస్యమైన కాలమునకు రోజుకు రూ. 100/-లకు తగ్గకుండా రూ. 200/-లవరకూ అసలు పన్ను మొత్తానికి మించకుండ విధిస్తారు.

ఇట్లే, ప్రతి మూడునెలలకూ ఒకసారి పంపవలసిన రిటర్నును పంపవలసిన తేదీలోగా పంపకపోతే అప్పుడు కూడ రోజుకు రూ. 100/-లనుండి రూ. 200/-ల వరకు జరిమానా విధిస్తారు.

ఒకవ్యక్తి లేక సంస్థ సర్వీస్ ట్యాక్సు చెల్లించవలసిఉండికూడ చెల్లించడము లేదు - అని సెంట్రల్ఎక్సయిజ్‌ఆఫీసరు అభిప్రాయపడితే ఆ వ్యక్తిలేక ఆ సంస్థపై ఈ చట్టము క్రింద తగినచర్య తీసుకోవచ్చు. అయితే ఆ అధికారి తీసుకొన్న ఆ చర్య (నిర్ణయం) సరియైనది కాదని సేవాసంస్థ లేక సేవచేసేవ్యక్తి అభిప్రాయపడితే, ఈ

చట్టములోని 71, 72, 73 సెక్షన్లక్రింద సెంట్రల్ఎక్సయిజ్కలెక్టరుగారికి అపీలు చేసుకోవచ్చు

ఈ సర్వీస్ ట్యాక్సును విధించుట ద్వారా జాతీయఆదాయములో 40 (నలభై) శాతము ఆదాయము లభిస్తుందని భారత ప్రభుత్వము అంచనావేస్తూంది

ఆదాయపు పన్నుచట్టము, ఎక్సయిజ్ ఆక్టులు ఉండగా ఈ సర్వీస్ట్యాక్సును ఫైనాన్సు ఆక్టు క్రిందికి తెచ్చారు ఇలా చేయడముపై తగువిధమైన పరిశీలన జరగడం అవశ్యమని ఆర్థికనిపుణులు భావిస్తున్నారు.

ఆదాయపుపన్ను, అమ్మకంపన్ను వసూలు శాతము తగ్గుముఖం పడుతున్న ఈ రోజుల్లో, ప్రభుత్వము సరిక్రొత్తగా ఈ సర్వీస్ట్యాక్సును ప్రవేశపెట్టడములో ఔచిత్యములేదని భావించిన కొన్ని వర్తక సంఘాలసమాఖ్యలు కేంద్రప్రభుత్వం తన బడ్జెట్లో ఈ సర్వీస్ట్యాక్సును ప్రతి పాదించిన వెంటనే చట్టము అమలును సవాలుచేస్తూ ఉన్నతన్యాయస్థానాల్లో 'రిట్' వేయాలని ప్రయత్నం చేశాయి. కానీ రిట్ వేసినట్లుగా తెలియలేదు.

ఈసర్వీస్ ట్యాక్సును విధిస్తూ చట్టము చేసే హక్కు కేంద్రప్రభుత్వమునకు ఉన్నదా? అనుటనుకూడ పరిశీలించ వలసిన అంశమని కొందరు ఆర్థిక నిపుణులు, వర్తక సంఘసమాఖ్యల ప్రతి నిధులూ భావి స్తున్నారు.

భారత రాజ్యాంగములోని 256 అధికరణ ప్రకారమూ, 'అధారటీ ఆఫ్ లా' అనగా చట్టబద్ధమైనసంస్థ తప్ప ఇతర సంస్థలు పన్నులు విధించడమూ, వసూలు చేయడమూ తగదని ప్రముఖఆర్థికశాస్త్ర నిపుణులు శ్రీ రఘురామన్గారు ఈ విషయముపై తమ అభిప్రాయాన్ని వెల్ల డించారు భారత రాజ్యాంగములోని 1వ షెడ్యూలు నుండీ 7వ షెడ్యూలు వరకూ గల అంశాలను పరిశీలిస్తే, కేంద్రప్రభుత్వం హక్కును గురించి తెలుస్తుంది 90వ ఎంట్రీక్రింద స్టాంపుడ్యూటీ, స్టాకు ఎక్చేంజి వ్యవహారాలూ మినహా మిగతాపన్నుల విధింపును గురించిన వివరాలు లభిస్తాయి అనిగూడ ఆయన ఈసందర్భంగా అన్నారు

'బిల్లులోగల మొత్తముపై ఐదు (5) శాతముపన్నును చెల్లించాలి అని చట్టములో స్పష్టంగా ఉన్నందున బిల్లు వేయకుండా తప్పించుకొను అవకాశాలే ఎక్కువగా ఉండవచ్చు' అని కొందరు అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు

ఈ సర్వీస్ ట్యాక్సు విధింపువల్ల భారత ప్రభుత్వానికి ఆదాయము లభించవచ్చు. కానీ అనేక సేవాసంస్థల్నూ, వ్యక్తులూ ఎన్నోరకాల ఇబ్బందులపాలు కావాల్సి వుంటుంది సాధారణవ్యక్తులు చట్టము లోని నిబంధనలు తెలియక జరిమానాలు చెల్లించవలసిన ఉంటుంది ఈ సర్వీస్ ట్యాక్సు విధించుటకు వీలుగా లక్షలాది మంది రిజిస్ట్రేషన్ చేయించుకోవడమేకాక మూడునెలలకు ఒకసారి రిటర్నులు పంపవలసిఉన్నందున సెంట్రల్ ఎక్సయిజ్ డిపార్టుమెంటువారికి పనిభారం పెరుగు తుంది - అనేవి ఈ చట్టము విషయములో వినిపించే విమర్శలు

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్)

టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004
శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030
పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682

## విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. <u>వాసవీ సత్రం, శ్రీశైలం</u>

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. <u>వాసవీ నివాస్, పుట్టపర్తి</u>

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1 రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును 2 రు 2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును దాత ఫొటో వేయబడును 3 రు 1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును

హాల్సు డోనార్సు 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము యివ్వబడును 14 అంకణములు పరిమితం

రు 2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును

అన్నదానమునకు రు 100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును

అన్నదానమునకు రు 10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము 4 10 95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము

వసతి సత్రమునకు విరాళములు

రు 60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును పొటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు 10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. పొటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం)

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్ధ మహా క్రతువు పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మి క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష ద్వీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార. భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము. - ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8 2 1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు 5 11 1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది

ఈ అన్నదాన సంఘానికి

రూ 10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ 5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ 2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు

రూ 1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు

రూ 10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును

రూ 5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి డి ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.10.97 నుండీ 20.11.97 వరకు)

మీది లేకు మీరు 1997-98వ సంవత్సరము క్రిందికి వచ్చే వ్యాపార సంస్థా? లేక వ్యక్తులా? అందుకు శాశ్వత ఖాతా (పర్మనెంట్ నెంబరు)ను పొందుటకు ఫారము నెం. 49 A తో దరఖాస్తు చేయుటకు ఆఖరు తేదీ ఈ నెల ఇరవై ఆరు అంటే 26.10.97 అను మాటను గుర్తుంచుకోవాలి.

చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించే వర్తకులు తాము కట్టవలసిన అమ్మకంపన్ను మొత్తానికి చెక్కును వ్రాసి నవంబరు 15వ తారీఖున కానీ, అంతకు ముందుగా కానీ అందుకు సంబంధించిన అధికారులకు అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి. చెక్కుద్వారా కాకుండా చలానా ద్వారా అమ్మకంపన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును ఈ నవంబరు నెల 20వ తేదీన కానీ, అంతకు ముందుగా కానీ చేరునట్లుగా అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారులకు పంపాలి.

(1) ఈ క్రింద పేర్కొన్న సంస్థలు, వ్యక్తులూ తమ ఆదాయపుపన్ను రిటర్నులను 31.10.1997వ తేదీలోగా దాఖలు చేయాలి.

1. సహకారసంఘాలు (Co-operative Societies)
2. ఇప్పుడు అమలులో వున్న ఆదాయపుపన్ను చట్టములోని 44 A.B. సెక్షను క్రింద తమలెక్కలను ట్యాక్సుఆడిట్ చేయించుకోవలసి యుండిన వారు.
3. ఇతరత్రా ఆదాయపుపన్నుచట్టములేక ఇతర చట్టముల ద్వారా తమ లెక్కలను ఆడిట్ చేయించుకోదలచినవారు.
4. పై సంస్థలు లేక ఫర్ములలో మెంబర్లు లేక భాగస్థులయినవారు.

(2) పైన కనబరచిన మేరకు ఆడిట్ చేయించుకోవలసినవారు, ఫర్మ రిజిస్ట్రేషన్ రెన్యూవల్ చేయించుకోదలచినవారు అందుకు సంబంధించిన 12వ నెంబరు ఫారమును ఇన్‌కంట్యాక్సు ఆఫీసులో 31.10.1997వ తేదీలోగా దాఖలు చేయాలి.

(3) జీతములనుండీ ఆదాయపుపన్నును పట్టుకొన్నవారు నెలవారి T.D.S. సర్టిఫికేట్లను పంపు 23వ నెంబరు ఫారమును కూడా 31.10.1997వ తేదీలోగా దాఖలు చేయాలి.

(4) ఇతర చెల్లింపులనుండీ T.D.S. పట్టుకొన్నవారు తమ అర్ధ సంవత్సరపు రిటర్నును 27 EA, 27 EB, 27 EC, 27 ED లలో తమకు అన్వయించిన ఫారములో దాఖలు చేయుటను కూడా 31.10.1997వ తేదీలోగా జరగాలి.

